# ప్రఖ్యాత నవలా సాహిత్యం

| | | |
|---|---|---|
| మర్డర్ | (డిటెక్టివ్) | 1-8 |
| బ్యాండిట్ | | 1-8 |
| పాతాళగృహం | | 1-8 |
| నేనూ—మా జానకి | | 1-8 |
| మాధురి | | 1-0 |
| మోహిని | | 1-0 |
| ఎడ్డీఫోలో | | 1-0 |
| చండశాసిని | | 1-0 |
| మగపిశాచి | | 1-0 |
| దండధరుడు | | 1-0 |
| దివిటీదొంగలు | | 1-0 |
| సి. ఐ. డి. | | 1-0 |
| అన్ జాన్ డాకూ | | 1-4 |
| ఎ.బి.సి. హత్యలు | | 1-0 |
| ఖూనీపై ఖూనీ | | -12 |
| తుఫాన్ మైల్ | | 1-0 |
| డాన్సింగ్ గరల్ | | 1-0 |
| సురస | (చారిత్రిక) | 1-8 |
| చాందసుల్తానా | | 1-8 |
| అమరవిజయం | | 1-8 |
| రుద్రమదేవి | | 1-8 |
| సాహసిక | | 1-8 |

అడ్వాన్సులేని ఆర్డరు అంగీకరించబడదు.

**కాళహస్తి తమ్మారావు అండ్**

సంస్కృతాంధ్ర గ్రంథాలయం (స్థా. 1882) రా

# తుఫాన్ మెయిల్

(డిటెక్టివ్ నవల)

రచన

శ్రీ కె. యల్. నరసింహారావు

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్,
సంస్కృతాంధ్ర బుక్‌డిపో (స్థా. 1882) రాజమండ్రి.

హక్కులు ప్రకాశకులవి

పునర్ముద్రణ

20 మార్చి 1955

మూల్యం 1-0-0

రాజేశ్వరి ప్రెస్

రాజమహేంద్రవరము.

## 1

అది కృష్ణపక్షం కావడంవల్ల ఆకాశాన్ని తారలు వివిధతరహాలుగా వెలుగుతున్నాయి. అందులో కొన్ని ముత్యాల్లాగా కొన్ని రత్నాల్లాగా, మరికొన్ని మణులకు మల్లేను, యింకోకొన్ని మాణిక్యాల మాదిరిగాను మిలమిల మెరుస్తున్నాయి—తళతళ లాడుతూ, తలకొక రకంగాను వెలుగందుతూ. ఆ గగనరంగానికో వింత కాంతిని గలుగజేస్తున్నాయి అవి ఎంత ప్రతిభావంతములవయినా, చిన్ని నక్షత్రాలేకదూ? అందుచేత వాటి కాంతివల్ల ప్రకృతి నిండు వెలుగును పొందలేకపోతూంది. ప్రపంచాన్నంతనూ కప్పిన, ఆ నల్లముసుగును ఆ తారలు తొలగింప లేకుండా ఉన్నాయి.

రాత్రి పదకొండు గంటలకు పైగానే గడచి ఉంటుంది. కలకత్తానుంచి రామనగరం పోయే మార్గంగుండా సాధారణంగా ఎంతో అవసరమైన కార్యం ఉంటేనేగాని ఎవరూ ప్రయాణం చెయ్యరు అందులోనూ యిటువంటి చీకటి రాత్రులలో అక్కడ బొత్తిగా జనసంచారమే ఉండదు. ఎటుచూసినా నిశ్శబ్దం. అప్పుడప్పుడా మార్గంలో ఉన్న ఈతచెట్లను, దుబ్బులను ఆశ్రయించుకొని ఉన్న ఏవో పురుగులు—పక్షులూ మాత్రం రొదచేస్తూ ఆ నిశ్శబ్దానికి భంగం కలుగజేస్తున్నాయి. కలకత్తానుండి రామనగరానికి ఎంతలేదన్నా, పాతికమైళ్ల దూరానికి తక్కువుండదు ఆ మార్గం అంత గమనయోగ్యం కాకపోవడంవల్ల అందరూ నడచే వెడుతూఉంటారు. ఆ దారిగుండా మోటారుబండ్లుకాని, జట్కాలుకాని నడవడానికి వీలులేదు. ఒంటెద్దుబండి మాత్రం ఎంతో

ప్రయాసమీద నడుస్తుంది. ఎవరైనా శ్రీమంతులా మార్గంగుండా ప్రయాణం చేయాలసి ఉంటే, మేనాలమీదనో, గుర్రాలమీదనో వెళ్తారు.

ఇపుడా అపరాత్రిని చీల్చుకొని ఒక ఒంటెద్దుబండి మెల్లగా నడుస్తూంది. ఎద్దు మెడలో ఉన్న గంటవల్ల కలిగే చప్పుడుకు అక్కడున్న పక్షులూ-పురుగులూ జెదరి మరింత రొదచేస్తున్నాయి. తన యజమాని ప్రయత్నం లేకుండానే ఆ యెద్దు మెల్లగా బండిని యీడ్చుకొని పోతూంది. అందుచేత బండివాడు ఓ ప్రక్కకొరిగి కునుకుపాట్లు పడుతున్నాడు. సందులు—పొదలు—లేని ఆ విదానమయిన బాటగుండా బండి నింపాదిగా పాకిపోతూంది.

ఆ బండికి సుమారిరవై గజాలకు ముందుగా నడుస్తూన్న మాధవుడు ఆ బండియొక్క గంటల చప్పుడు విని వెనుదిరిగి చూచాడు. ఆ బండి తన దగ్గరకు వచ్చేవరకు అతనక్కడే నిలబడి పోయాడు. బండి క్రమంగా వచ్చి అతని ముందునుంచే నడచి పోయింది. మాధవుడా బండిలో ఉన్నదెవరా అని పరకాయించి చూచాడు. కాని తెలుసుకోలేకపోయాడు. ఆ పాడు చీకటి అతని ప్రయత్నాని కంతరాయం కలిగించింది. ఆ బండిలో ఎవరో ఒక్కరే ఉన్నారని మాత్రం అతనెంతో ప్రయత్నంమీద గుర్తించ గలిగాడు. కాని వారు స్త్రీలా, పురుషులా అనే సమస్య అతన్ని బాధించడం మొదలుపెట్టింది. ఆ అర్ధరాత్రివేళ అలాగున ఒంటరిగా ప్రయాణం చేస్తూన్న వాళ్ళ ధైర్యాన్ని అతను లోలోపలనే మెచ్చుకొని, ఆ బండి వెనకాలనే తానుకూడా నడవడం మొదలు పెట్టాడు. ఇంతలో ఆ చేరువనున్న పొలంనుంచి ఓ నక్క భయంకరంగా అరచింది. దానితో బండివాడు ఉలికిపడ్డాడు.

బండిలోని వ్యక్తికూడా మరింత భయపడి ఉంటుంది. మాధవుడు మాత్రం అంతకుముందు రెండుమూడుసార్లు ఆ నక్క అరవడం విని ఉన్నాడు గనక అంతగా బెదరలేదు. అప్పుడు అలాగున అరచినది నక్క అని తెలిసాక బండివాడు మనస్సును కొంత వరకు దిట్టపరచుకొని బండిలో ఉన్న వ్యక్తితో ఇలా అన్నాడు—

"అమ్మగారూ! వెదవనక్క ఎంత గాభరా కలిగించిందండీ! మీకు కునుకు పట్టినట్టుంది."

"నా కంటికి కునుకంటూపట్టి నాలుగేళ్ళయింది. అందులోనూ ఇటువంటి ప్రమాదావస్థలో నున్న వాకు కునుకెట్లాపడుతుంది నాయనా? కాని వెధవప్రాణం కదూ. ఆ నక్క అరుపు వినగానే నా ప్రాణం ఎగిరిపోయినట్లయింది. నువ్వు పలుకరించే దాకా ఒంటిమీద స్పృహఅయినా లేదు"

"అయితే, అమ్మగారూ! నాలుగేళ్ళనుంచి కునుకేలేదంటున్నారుగదా? అదేలా"

"ఎలాగున ఏమిటి నాయనా అది నా కర్మం"

"నిద్రలేకుండా ఉండడం ఎంతయినా కష్టమే. ఒక్క రాత్రి నిద్రలేకపోతేనే నాకు చచ్చినంతపని అవుతుందండీ. అలాంటిది........."

"ఒక్కనిద్రేకాదు. తిండికూడా సరిగాపోదు. ఏంచెయ్యను"

"ఒంట్లో ఏమయినా జబ్బు ప్రవేశించిం దంటారా"

"అలాంటి దేమయినా అవుతే నయ్యమే"

"నేను వినకూడదంటారా? చెప్పండమ్మా. నేనూ పిల్లలగలవాణ్ణి. మొదట్లో పెద్దబ్రతుకు బతికాను. ఇదివరకు నా రోజులు బాగుండకపోబట్టి ఈలాగును బండితోలుకొని బ్రతకాలసొచ్చింది"

"చెప్పడానికేముంది నాయనా నిక్షేపంలాంటి ఒక అమా యకురాలి నూరేళ్ల బ్రతికే బ్రతుకును నా చేతులారా నులిమేశా.... ఆమె జీవితాన్ని అంధకారమయం చేశాను. ఇందిర నా కన్న కూతురు. అది ఎనిమిదేళ్ళ అజ్ఞానదశలో ఉండగా దాని గొంతు కోశాను మేనరికం కలిసిన సంభంధం అని ఆశపడి, గుండె జబ్బువాడి కిచ్చి దాన్ని పెళ్ళిచేశాను అది రజస్వల అయిన ఆ మరునాడే అతగాడు హఠాత్తుగా చచ్చిపోయాడు. ఆ మా తల్లి కిప్పుడు పదిహేనో ఏడు అది నేర్వని విద్యలేదు—పాడని పాట లేదు—అది అందాల దొంతర అంటేనమ్ము. అటువంటి మహా గుణసంపన్నకు విధవరికం ఎక్కడరాసిఉందో బోలెడంత ఆస్తి అనుభవించేవారు లేరుకదా! దాని తండ్రే బ్రతికిఉంటె ఈనా పెత్తనం సాగకపోయేదేమో. నా చేతులారా దాని అందాన్ని—గుణాలను—సర్వసౌఖ్యాలను ధ్వంసంచేసిన యీ నా పాపానికి ప్రాయశ్చిత్తంలేదు"

ఆమె చెబుతూన్న మాటలను వింటూనే మాధవుడా బండి ప్రక్కగా నడుస్తున్నాడు. తమ వెంబడినే ఎవరో నడుస్తున్నారని ఆస్త్రీ యెరుగదు—బండివాడూ ఎరుగడు. ఆమె మళ్ళీఅంటూంది—

"నా తల్లి ఇప్పుడిప్పుడు అన్నీ గ్రహించుకొంటూంది. తన్నుచూసి అందరూ దిగాలుపడి చూడడం—ఏమేమో గుసగుస లాడడం—తన నొసటను బొట్టుపెట్టడాని కెల్లరూ వెనుకంజ వెయ్యడం—పెళ్ళి పేరంటాలలో తన కెటువంటి గౌరవమూ జరుగకపోవడమూ—ఇవన్నీ చూసి నా యిందిర ఒక్కొక్కప్పుడు కొల్లాపడుకొని కుమిలి, కుళ్ళి ఏడుస్తూంటే నా తల్లి ప్రాణం ఎలా

గున ఉంటుందో పిల్లలగలవాడ వయిన నీకు తెలియకపోదు "
అని ఆ వితంతుస్త్రీ కళ్ళనుంచి నీరు కారుస్తుంటే ఆ బండివాడు అన్నాడు—

" అమ్మగారూ! మీకు కోపంవస్తే నేను చెప్పలేనుగాని ఈ విషయంలో మాత్రం మీ బ్రాహ్మణజాతి రాక్షసిజాతి కంటే కూడా కౄరంగా ప్రవర్తిస్తుంది. మాలో యిలాంటి ఘోరంలేదు. మారుమనువు మరియాదహీనం గాదు "

" నిజమే. మా సంఘనియమా లిల్లాంటివి. ఎవరేమి చెయ్యగలరు? మా బ్రాహ్మణజాతి అంటె అగ్నిహోత్ర మన్న మాట ఇటువంటివి అనకూడదు—వినకూడదు "

" ఏమోనమ్మా మీజాతి గౌరవానికి—నియమాలకూ మీరే సంతోషించండి. కాని మాలాంటి వాళ్ళకవి అర్థంకావు. అయితే అమ్మగారూ! కలకత్తాలో మీకు బంధువు లున్నారా! లేకపోతే అదే మీ నివాసమా "

" అక్కడ మా తమ్ముడికి పంచదార ఫేక్టరీలో పని. నెలకు అయిదువంద లిస్తారు. ఈ మధ్య వాడికి ఒంట్లో సుస్తీ చేసిందంటేను, వెళ్ళి చూసివస్తున్నాను, మా నివాసం అసలు గోదావరిజిల్లా దరిమిలాను. మావాళ్ళందరూ ఈ ప్రాంతాల్లోనే ఉద్యోగాలు చేసి. స్థిరమయిన భూవసతులు—అవీ ఏర్పరచుకొన్నారు. రానురాను మా కందరకు నివాసం ఇక్కడనే అయిపోయింది "

"మరయితే అప్పుడే మీ తమ్ముడుగారి యింటిదగ్గరనుంచి వెళ్ళిపోతున్నా రేమండమ్మా "

"మా ఇందిర తల్లికి వారం రోజులనుంచి ఉష్టం వస్తూం విట. అందుచేత ఏమీ తోచక, రాత్రిపూట అని అయినా సందేహించక బయలుదేరాను. మా తమ్ముడుకూడా నాతో రావలసిందే. కాని శలవు దొరక్కపోవడంవల్ల రెండుమూడు రోజుల్లో వస్తున్నావని చెప్పి, నన్ను వెళ్లమన్నాడు. అయితే అబ్బాయీ ! ఇప్పుడు మనమెంత దూరం వచ్చినట్లు ? ఎక్కడా దారీతెన్నూ అవుపించడంలేదు "

" చాలాదూరం వచ్చేసామండమ్మా. ఇక్కడున్న రమేశచందుగారి ' టీ ' తోటకు మీ రామనగరం ఎనిమిది మయిళ్ళండి. ఆదేనండి కనుచూపు మేరలో ఉంటుందా తోట " ' టీ ' తోట మాట వినగానె ఆమెకు గుండెల్లో ఏదో అదటు బయలుదేరింది. శరీరం వణకడం మొదలుపెట్టింది. ఇంతకుముందనేకసార్లు ఆ టీతోటలో పనిచేసే కూలీలు దొంగలనీ, అనేక సారులు వీళ్లు, ఆ మార్గంగుండా పోయే బాటసారులను అదలించి సొమ్ములు దోచుకొంటూ ఉండడం కలదనీ ఆమె విని ఉండడంవల్ల ఇప్పుడిల్లాంటి భయానికి అవకాశం కలిగింది. టీ తోటమాట వినగానే ఆమె బండివాడితో ఇలాగున అన్నది—

"ఏమోయ్ ! బండిని త్వరగా పోనియ్యి. ఈ టీతోటలో పనిచేసే వాళ్ళలో దొంగలున్నారట గదూ ! వీళ్ళే ఇదివరలో మా గ్రామం వచ్చే పోయేవాళ్ళను హింసించారని విన్నాను. అందుచేత నా గుండెల్లో ఈ టీ తోట మాట వినగానే అదటు బయలుదేరింది "

" అవునండమ్మా ! మీరు విన్నమాట ఎదార్థం కాకపోదు. ఎందుకయినా మంచిది, బండిని త్వరగా పోనిస్తాను "

అని ఆ బండివాడు తన కొరడాతో ఎద్దు వీపుమీద చర్ర మనిపించాడు దానితో ఆ జంతువు ముందుటికంటె కొంచం చురుకుగా నడవడం మొదలుపెట్టింది. కాని ఆ బాట సరిఅయినది కాకపోవడంవల్ల ఎద్దు బండిని ఎంతోసేపు వడిగా లాగలేక పోయింది. మళ్ళీ ఎథాప్రకారంగా మందగమనంలో పడింది. అంతవరకూ బండివాడూ, వృద్ధురాలూ మాటలాడుకొన్న మాట లను ఆలకిస్తూ, నడుస్తూన్న మాధవుడికి, టీ తోటలో దొంగ లున్నారు అని వినడంతోనే, ఉద్రేకం కలిగింది. అతని శరీరంలో ప్రవహించే నెత్తురు ఉడుకెత్తింది ఇంతకుముం దెప్పుడూ అతను టీ తోటలో పనిచేసేవాళ్ళను గురించి అంతచెడ్డగా విని ఉండలేదు. అతను చేరుకోవలసిన స్థానంకూడా యిప్పుడు ఆ టీతోటే కనక అతను, ఆ బండిలోని వితంతువు చెప్పిన మాటలను గురించి, ఆలోచించుకొంటూ అక్కడే ఉన్న ఇంకో మలుపు తిరిగాడు-టీ తోటలో ప్రవేశించడానికి. అత నలాగ ఓ నలభయిగజాల దూరం నడిచేటప్పటికి, బండి బోల్తాపడినట్లు ఓ పెద్దచప్పుడు నాతను విన్నాడు. ఆ వెంటనే " అమ్మయ్యో! దొంగలు—దొంగలు, రక్షించండర్రోయ్ " అని ఇంతకు ముందువరకు అతను విన్న స్త్రీ యొక్క కంఠమె పెద్దగా అరచిన అరుపు మాధవుడి కర్ణపుటా లలో హఠాత్తుగా చొరబడింది. అతడింక తడవుచేయక ఆ ధ్వని వచ్చిన వైపునకు మళ్ళీ ఒక్కపరుగులో వచ్చి పడ్డాడు.

అక్కడ బండి తలక్రిందులుగా పడిఉంది, ఎద్దూ, బండి వాడూ కనిపించలేదు. స్త్రీని ఎవరో ఇద్దరు గట్టిగా పట్టుకొని నోట్లో గుడ్డలు కుక్కుతున్నారు. మరోయిద్దరు ఆమెయొక్క పెట్టె—మూటా విప్పి కొన్ని విలువయిన బట్టలు, సొమ్ము

మాత్రం మూటగట్టుకొని, మిగిలిన తమకు పనికిరాని వాటిని అక్కడ పారేస్తున్నారు. ఆ గుడ్డిచీకటిలో కూడ కనుపించిన ఈ దృశ్యాన్ని జూచిన మాధవుడు సహించలేకపోయాడు. తన చేతిలో ఒక కర్ర అయినా లేకపోయినందు కతడు కొంచంసేపు విచారించాడు. అయినా ఇక ఆలస్యం జేయడంవల్ల ఒక స్త్రీ అపాయ స్తితి పొందుతుందనీ—ఆమెను రక్షించడం తన కప్పటి ప్రధాన కర్తవ్యమనీ గ్రహించి, వెంటనే ప్రాణాలకు సయితం తెగించి, కళ్లు మూసుకొని, ఆస్త్రీ నోట్లో గుడ్డలు కుక్కుతూన్న ఆ యిద్దర దొంగలమీదా ఉవ్వెత్తుగాపడి, తన శక్తికొలది వాళ్ళమీద గుద్దుల వర్షం కురిపించాడు. ఇంతలో మిగిలిన యిద్దరు దొంగలు తమ స్నేహితుల్ని గూడి మాధవుణ్ని బంధించడానికి ప్రయత్నిస్తూంటే అతను వాళ్ళకు లొంగకుండా పెనుగులాడుతున్నాడు. చీకట్లో జరిగే ఆ ద్వంద్వయుద్ధాన్ని జూస్తూ వణుకుతున్న శరీరంతో ఆ స్త్రీ అలాగే చేష్టలు దక్కి నిలబడిపోయింది. ఇంతలో అంత పరాక్రమంతో తమతో పోరాడుతున్న ఆ వీరు డెవడా అని ఒక దొంగ 'టార్చిలైటు' ను మాధవుడి ముఖంమీద వేసిజూసి " మాధవరావుగారే నర్రో " అని ఒక పెద్ద కేకవేసి, ఆ టార్చిలైటు నక్కడ పారేసి, పారిపోయాడు. వాడి మాటలనువిన్న మిగిలిన దొంగలు మ గ్గురూ కాలికి బుద్ధిచెప్పారు. మాధవుడు వాళ్ళను వెంటాడించాలని చూసాడు. కాని, ఆ చీకట్లో వాళ్లెటు మాయమయినదీ తెలియకపోవడంవల్ల మెల్లగా అక్కడ వణుకుతూన్న వితంతుస్త్రీ దగ్గరకు వెళ్ళి " అమ్మా ! మీకిక భయంలేదు. దొంగలు పారిపోయారు. మీ బండివా డేడీ ! " అని అడగ్గా ఆమె గుండెను దిట్టపరచుకొని, " నాయనా ! నా ప్రాణాల్ని రక్షించిన నీ వెవ్వరవు !

నీ ఋణం నేను తీర్చుకోలేను తండ్రీ " అని అతని కాళ్ళమీద పడి వెక్కి వెక్కి యేడ్వడం మొదలుపెట్టింది. అప్పుడు మాధవుడు ఆమెకు ధైర్యంగొలిపే కొన్ని మాటలను పలికి, తన కాలికి తగిలిన టార్చిలైటును తీసి, వెలిగించి, " అమ్మా ! పాపం మీ రెవ్వరో చాలా అపాయస్థితిని పొందారు. నేను రాకపోతే చాలా ప్రమాదం జరిగి ఉండేది. మీ బండివా డెక్కడ ? ఎద్దు కనుపించదే ! " అని లైటువేసి నాలుగుప్రక్కలా జూస్తు అన్నాడు.

" ఎవళ్ళప్రాణం వాళ్ళకు తీపికదా నాయనా ! దొంగలు వచ్చి ఎద్దు మెడతాడును గోసెయ్యడంతోనే బండివాడు భయపడి పారిపోయి ఉంటాడు. ఎద్దుసంగతేమో నే నెరుగను " అన్నది.

" అయ్యో బామ్మగారూ ! ఎంతటి దారుణం జరిగింది ! ఇదిగో మీ వస్తువులన్నీ ఇక్కడే పడేసిపోయారు. వాళ్లు ఒక్క పూచికపుల్ల అయినా తీసుకుపోలేదు. రూపాయల మూటకూడా ఇక్కడనే పడివుంది. అన్నీ జాగ్రత్తగా మూటకట్టండి. ఈ చేరువలో ఎక్కడయినా ఎద్దు తిరుగుతుందేమో చూస్తాను " అని లైటువేసి వెదకబోతూంటే. కొంచం దూరంలోనే ఎద్దు పచ్చికను మేస్తూంది. వెంటనే మాధవుడు, దాని కొమ్ములకు గట్టబడిన తాడును బట్టుకొని యెద్దును బండిదగ్గరకు లాక్కొని వచ్చి, బండికి కట్టి " బామ్మగారూ ! ఇంకా ఏ ప్రమాదం రానై ఉందో, మీరు బండి నెక్కండి. బండివాడు ఇక వచ్చేటట్టు కనపడదు. నేనే బండిని తోలి, మిమ్మల్ని మీయిల్లు క్షేమంగా చేరుస్తాను. సందేహించకండి " అన్నాడు

" అయ్యో ! నా తండ్రీ నా మూలాన్ని నీకెంత శ్రమ కలిగింది ! కాని యిప్పుడు నీ సహాయం లేకపోతే నేను చచ్చి

పోవాలిగాని వేరు దారేదీలేదు నాయనా ! నీ ఋణం నేను తీర్చుకో లేను " అంటూ తన సామాను నంతను బండిలో పెట్టుకొని, తానూ బండెక్కింది. తరువాత మాధవుడు బండివాడి స్థానాన్ని ఆక్రమించి, లైటు వెలిగించి, ఓ చేత్తో పట్టుకొని, రెండోచేత్తో బండిని తోలడం మొదలుపెట్టాడు. క్రమంగా బండి రామనగరం మార్గాన్ని అనుసరించి పోయింది.

## 2

ఆమరునాటి ఉదయాన్నే మాధవుడు నిద్రనుంచి మేల్కొంచి, ఎంతో బడలిన శరీరంతో వాకిట్లోకి నడచి, అక్కడున్న అరుగు మీద గూర్చుని ఒళ్ళంతా చితకగొట్టినట్లు నొప్పులుగా ఉండడం వల్ల ఏంచేదామా, అని ఆలోచిస్తున్నాడు. ఇంతలో ఒక పదిహే పేళ్ళ అమ్మాయి ఎవరో యింటిలోపలనుంచి వచ్చి, ఒక వెండి మరచెంబుతో నీళ్ళు, పండ్లుదోముకొనే బూడిదా, దెచ్చి మాధవు నకు వెనుకతట్టున పెట్టింది. అప్పుడు కొంచం చప్పు డవడంవల్ల అతను వెనుదిరిగి చూసేడు. అంతలోనే ఆమె మెఱుపల్లె మెరసి, ఒక్క గెంతులో లోపలకు వెళ్ళిపోయింది. ఆమెను పూర్తిగా చూడడానికి మాధవుడికి అవకాశం చాలిందికాదు. అంతమాత్రానికే అతనికళ్లు మిరుమిట్లు గొల్పాయి. రాత్రి తాను దొంగల బారినుంచి కాపాడిన స్త్రీయొక్క కుమార్తె ఈమెయే అయి ఉంటుందని అతను ఊహించుకొన్నాడు. తరువాత అత నామెయొక్క రూప లావణ్యాదులను తలుచుకొంటూ, తనకోసం ఆమె తెచ్చిపెట్టిన నీళ్ళతోను ముఖం కడుక్కొని, గతరాత్రి ఆమెతల్లి బండివాడితో తన కుమార్తెను గురించి చెబుతూండగా, తాను వినిన సంగతుల

నన్నింటినీ పునశ్చరణకు దెచ్చుకొంటూ, 'పాపం' ఇటువంటి సౌందర్యాల కుప్పకు వైధవ్యం కలుగజేసిన భగవంతుడు నిర్దయుడు అనుకొన్నాడు. ముఖం కడుక్కొని లోపలకు రాబోతూంటే, అక్కడున్న తలుపుపైన ఒకటర్కీ తువ్వాలు తగిలింపబడిఉంది. ఆ అమ్మాయే తనకోసం ఆ తువ్వాలు నక్కడవేసి ఉంటుందని గ్రహించిన మాధవుడు, దానిని తీసికొని ముఖం తుడుచుకొంటూ లోపల ప్రవేశించాడు.

"నాయనా! అయిందా ముఖం కడుక్కోవడం? లోపలకురా టీ పుచ్చుకొందువుగాని" అని చెప్పి, అతనికి పరిచితురాలైన వృద్ధస్త్రీ మాధవుణ్ని ఒకవిశాలమయిన గదిలోనికి తీసుకొనిపోయింది. అక్కడకొన్ని పేముకుర్చీలూ, సుందరమయిన మేజాలూ అమర్చబడి ఉన్నాయి. అందుకొన్ని మేజాలపైకొన్ని అల్లిక గుడ్డలు పరువబడి ఉండి, వాటిమీద కొన్ని పూలకుండ్లు చక్కగా అమర్చబడి ఉన్నాయి.

"కుర్చీలో కూర్చోబాబూ! రాత్ర స్తమానము నన్ను గురించి చాలా శ్రమపడ్డావు. ముఖమంతా బడలిన ట్లవుపిస్తూంది"

"ఆఁ! దానికేమిలెండి. ఇంతకూ మిమ్మల్ని ఏఅపాయము లేకుండా ఇల్లు చేర్చగలిగాను. అదే నాకు సంతోషం"

"అలాగున అనకు నాయనా! ఇల్లాంటి ఉపకారబుద్ధి అందరకూ ఉండవద్దూ? నా పుణ్యం బాగుండబట్టి దేవుడు నా సహాయార్థం నిన్ను పంపాడు. ఆ ప్రమాదావస్థలో నువ్వురాకపోతే నేనీపాటి కేలోకంలో ఉండేదాన్నో. నాబిడ్డ మరీ దిక్కులేనిపక్షి అయిపోను. వేడినీళ్లు కాగిఉన్నాయి పోసుకుంటావా నాయనా"

"మరేనండి పోసుకోవాలనే ఉంది. ఒళ్ళంతా నొప్పులుగా కూడా ఉంది"

"అయ్యో బిడ్డా ఎంత అలసట పడిపోయావోయ్. నిన్ను శ్రమపెట్టిన నేను మహా పాపాత్మురాల్ని. అవుతే నాయనా ఆవిరి పట్టు, తరువాత స్నానం చేతువుగాని. ఆవిరిపడితే ఒళ్లునొప్పులు పోతుంది. ఉండు ముందర టీ పుచ్చుకుందువుగాని. అమ్మా ఇందిరా"

మాధవుడు మౌనంతో తన అంగీకారాన్ని సూచించి. ఆ బల్లమీద పరచబడిన గుడ్డయొక్క అల్లిక చాతుర్యానికి ఆశ్చర్య పడి చూస్తూ "అయితే బాంమ్మగారూ ఈ గుడ్డను ఎక్కడ కొన్నారు? ఇందిమీది అల్లికపనిని ఎవరో మంచి సమర్థులయిన వారు చేసిఉండాలి"

"అది కొన్నది కాదునాయనా మా అమ్మాయి చేతిలోనే అల్లింది దాని తెలివితేటలకు విద్యలకు ఎటువంటిలోటూ లేదు నాయనా. దానికి అయిదోతన మొక్కటే కరువైపోయింది కాని, మరేలోటూ లేదు భగవంతుడు నిర్దయుడనడానికి నేనందుకే సాహసిస్తున్నాను ఒక్కొక్కప్పుడు దాని భావిజీవితాన్ని తలచుకుంటే నాగుండె బ్రద్దలైపోతుంది. కాని ఏంచెయ్యను"

"అయ్యో పాపం! అలాగునా అండీ? ఇంతకూ భగవల్లీలలు మనకు తెలియవుకదండీ"

అని వాళ్ళిద్దరూ అలాగున మాట్లాడుతూ ఉండగా ఇందిర ఒక వెండి పళ్ళెంలో కొన్ని ఫలహారాలను, ఒక గాజుకప్పునిండా టీని, ఒక సాసరును, తెచ్చి మాధవుడు కూర్చొని ఉన్న కుర్చీ దగ్గరి బల్లమీద ఉంచి, తల్లిదగ్గరకు పోయి నిలుచుంది. దీర్ఘము

లయిన ఆమె నల్లటి కురులను, పండు పండు తమలపాకువంటి శరీరచ్ఛాయను, తీర్చి దిద్దినట్లుండే ఆమె కనుముక్కు తీరును చూచిన ప్రథమ క్షణములోనే మాధవుడు ముగ్ధుడై పోయాడు. ఆమె నడచినప్పుడు విలాసం ఒలికినట్లుగా మాధవుడికి తోచింది. అటువంటి సుందరాంగికి వైధవ్యం కల్పించిన విధాతను అతను లోలోపల చాలాసార్లు నిందించుకొన్నాడు. ఆమెను ఇంకా చాలా సేపు తనివితీరా జూడాలని అతనికి ఉంది. కాని, అలాగున జూస్తే ఆమె తల్లి తన్ను మర్యాదహీనుడిగా తలుస్తుందేమో అని, అతను తన కోరికను లోలోపలనె అణచుకొన్నాడు. తల వంచుకొని మెల్లగా బల్లమీద ఉన్న ఫలహారాన్ని భుజించడానికి ఉపక్రమించాడు. అప్పుడు ఆస్త్రీ తన కుమార్తెవైపుజూపి, మాధవుడితో "నా చిట్టితల్లి ఇందిర ఇదే నాయనా! ఇంతకుముందు చూడలేదనుకొంటాను. రాత్రి మనం వచ్చేటప్పటికి నిద్రపోతూంది. నా బిడ్డసంగతి నేను చెప్పుకోగూడదు కాని నా తల్లి విద్యల సరస్వతి—అందాల దొంతర—గుణాల పాలవెల్లి జూసావుకదూ?

ఆ అమ్మాయిని మరోసారి చూడ్డానికి అవకాశం గలిగినందుకు మాధవు డపరిమితానంద మంది విస్మయంగా ఇందిర వైపు చూసాడు. జూసినప్పుడల్లా అతని కామెలో ఏదో క్రొత్త అందం కనిపిస్తూంది. ఆమెకూడ ఒక్కసారి కన్నెత్తి మాధవుడి వయిపు జూసింది అప్పుడు వాళ్ళిద్దర చూపులూ అప్రయత్నంగా కలుసుకొన్నాయి—ఇద్దరూ సిగ్గుపడా రెందుకో. ఆమె తల్లి ఇందిర చెక్కులు నిమురుతూ, మాధవుణ్ని జూపి, "అమ్మా! రాత్రి నన్నా దొంగల బారినుండి రక్షించి నీకు తిరుగ మాతృభిక్ష పెట్టాడని చెప్పేనే—ఆ పుణ్యమూర్తి ఇతనే" అన్నది. అప్పుడు ఇందిర

ఆశ్చర్యంతో దొంగతనంగా క్రీగంట టీ తాగుతూన్న మాధవుడి వైపు జూసింది. మాధవుడా విషయాన్ని గమనించకుండా "బామ్మగారూ! మీరు నన్ను అవసరంగా అధికమయిన స్తుతి జేస్తున్నారు. ఈమాత్రదానికి నన్నింతగా పొగడడం అనవసరం ఎవరయినా ఒకస్త్రీ—నిస్సహాయురాలు—అపాయస్థితిలో ఉంటే ఆమెను రక్షించడానికి ప్రయత్నించడం అనేది ప్రతి పురుషునికి విధి. అందుచేత మీరు నన్నింతగా ప్రశంశింప నక్కరలేదు నా విధాయక కృత్యాన్ని నేను నెరవేర్చాను. అందులో విశేషం ఏమీలేదు"

"నాయనా! సద్ధర్ముడయిన పురుషులు అలాగునే అంటారు కాని, నీ విషయం అడుగుదా మనుకుంటూనే ఎప్పటికప్పుడు మరచిపోతున్నాను నన్ను రక్షించిన నీ పుణ్యనామాన్ని నేను విన వచ్చునా? నీకు కలకత్తాలో ఏదయినా పనా? నీకు వివాహం అయిందా? తలిదండ్రులు ఉన్నారా? అసలు మీ నివాసం ఎక్కడ? నాయందు దయఉంచి ఈ విషయాలను చెపుతే సంతోషంతో వింటాను"

"అమ్మా! ఈమాత్రం దానికినన్నింతగా ప్రాధేయపూర్వకంగా అడగాలా? నన్ను మాధవరా వంటారు. తలిదండ్రులు చిన్నతనంలోనే పోతే, మా మేనమామ నన్ను జేరదీసి విద్యాబుద్ధులు చెప్పించాడు. మాది గుంటూరుజిల్లా నివాసస్థలం. చుట్టుపట్ల ఎక్కడా ఉద్యోగం దొరకకపోవడంవల్ల అరు సంవత్సరాల క్రితం ఈ కలకత్తాపట్నం వచ్చి చేరాను. రమేశచందు అన్న అయినకు పెద్ద టీ ఎస్టేటు ఉంది. రమేశచందూ, మా మేనమామా కలకత్తాలోనే చదువుకున్నారట. ఆ పరిచయం వల్లనే, మా మేన

మామ నన్ను యిక్కడకు పంపి. ఈ జమీ దారుకు సిఫార్సు చేసాడు ఆ పూర్వ స్నేహాన్ని తలచి. రమేశచంద్రు నాకో నూట అరవై రూపాయల ఉద్యోగం కల్పించి, తనవద్దనే ఉంచుకొని, మా మేనమామయందు దుండే స్నేహాన్ని ప్రకటించాడు. అప్పటి నుంచీ నేను కలకత్తాలోనే వుంటూ కాలక్షేపం చేస్తున్నాను. మా మేనమామ తన కూతుర్ని నాకిచ్చి వివాహం చెయ్యాలని చూస్తున్నాడు. కాని నా కిపుడప్పుడే పెళ్ళిచేసుకునే వుద్దేశం లేకపోవడం వల్ల అది ఇంతవరకూ జరగలేదు. నిన్నటిరాత్రి మిమ్మల్ని దొంగలు ముట్టడించిన తావులోవున్న టీతోట రమేశచంద్రుగారిదే. ఆ టీతోటకు సంబంధించిన వ్యవహారా లన్నింటినీ నేనే చూస్తూ ఉంటాను. నిన్నరాత్రి ఒక జరూరు పనివుండడంవల్ల కాలినడకనే తోటదగ్గరకు పోవాలసివచ్చి, చాలాదూరం మీ బండివెనకాలె వచ్చేను. తీరా నేను తోటదాకా వచ్చి, మళుపు తిరిగేటప్పటికా ఘోరం జరిగింది. నేనుగాని, మా యజమానుడుగాని, తోటలో పనిచేసే వాళ్ళలో ఇలాంటి దొంగలుండి, ఇటువంటి దారుణ కార్యాలు జరిగిస్తున్నారని ఇంతకుముం దెప్పుడూ వినియుండలేదు. ఇక మేముకూడా వాళ్ళనుగురించి తగుచర్య తీసుకోకతప్పదు; రాత్రిపూట అవడంవల్ల వాళ్ళ ముఖాలను గుర్తుపట్టలేక పోయాను. ఒకడి గొంతుకను మాత్రము ఆనవాలు కట్టానులెండి· ప్రయత్నం చేస్తే సర్వం బోధపడుతుంది ”

“ అయ్యో నాయనా ! అయిందేదో అయింది. ఆ దుర్మార్గులతో జోక్యం కలుగజేసికోకు బాబూ ! వాళ్లు నీ కేమయినా కీడు తలపెడతారేమో కూడాను. ‘ పిల్లి బ్రహ్మశక్తి ’ ఇంతకుముందు చాలాసార్లు మా గ్రామస్థులు ఆ టీతోట దగ్గరనే సరిగా దొంగల

వల్ల హింసించబడడం కలదు. ఇప్పుడు నేనేస్వయంగా అనుభ వించాల సొచ్చింది. సంగతెరిగి వున్నప్పుడు రాత్రులా మార్గం గుండా ప్రయాణం చెయ్యకబోవడమే తగినపని. అంతేకాని నాయనా! నువ్వుమాత్రం ఆ దుర్మార్గులతో జోక్యం కలుగ జేసుకోకుమీ "

" ఏడిశారు వాళ్లు నన్నేం చెయ్యగలరు లెండి. మరి నేనీ పూట వెళ్ళిపోతాను, శలవియ్యండి. మిమ్మల్ని సురక్షితంగా ఇల్లు చేర్చగలిగినందుకు సంతోషిస్తున్నాను "

" ప్రాణాలు రక్షింపబడడమే కాకుండా, నా తల్లికి జ్వరం కూడా తగ్గిందట "

" ఇంతకుముందు సుస్తీచేసిందా యేమండి "

" సరే నాయనా! దానికి జ్వరం వస్తూందని వినబట్టే కాదూ, రాత్రికి రాత్రి ప్రయాణమై వచ్చాను "

" మీరు బయలుదేరిన వేళ మించింది. మీకో గండం తప్పడమే కాకుండా, మీ అమ్మాయికి కూడా స్థిమితంగా ఉంది "

" ఇంకా సందేహమా నాయనా! అప్పుడే వెళ్ళాలంటు న్నావు. రెండు రోజులపాటు మా యింట్లో ఉండి, మా ఆతిధ్యం అంగీకరిస్తావేమో అనుకున్నాను ఈ పూటకైనా ఉండి, మధ్యా హ్నం వెళ్ళమనీ నా ప్రార్థన. నా ప్రార్థన అంగీకరించక తప్పదు "

" అమ్మా ఎంతమాట. మీరు పెద్దలు—నన్ను ప్రార్థించడ మేమిటి "

" వయసుకు పెద్దదాన్నయినా, గుణాలకు నిన్ను బోలలేను నాయనా! వీలయినప్పుడల్లా మా గ్రామం వచ్చి, మమ్మల్ని చూస్త పోతుంటానని వాగ్దానం చెయ్యాలి. నీ విప్పటినుంచి, మాకు ఆ ప్త

బంధువుడివి. మాకు దగ్గరలో ఉండడమే కాకుండా, మాఅన్నయ్య కూడా కలకత్తాలోనే ఉండడంవల్ల, మేము అక్కడకు వచ్చినప్పుడల్లా, నీ దర్శనం చేస్తూ ఉంటాము"

"మీ అన్నయ్యగారు కలకత్తాలోనే ఉంటున్నారా అండి పేరు"

"సుదర్శనం—మీ రెరిగే ఉంటారు"

"ఆఁ! ఆ పంచదార ఫాక్టరీలో డైరక్టరుగా ఉండే ఆయనా అండీ"

"మరే"

"ఎప్పుడయినా కనిపిస్తుంటాడా"

"ఆఁ!"

"అమ్మా ఇందిరా! ఆవిరికి నీళ్లు పెట్టించుతల్లీ! పాపం పొద్దుపోయింది"

ఆ మాటలు చెవిని పడీ పడడంతోనే ఇందిర ఆ చోటును విడిచే పోయింది. ఆమె వెళ్ళిపోవడం మాధవున కెందుకో చాలా బాధగా ఉంది.

## 3

"నీకు వీలుకలిగినప్పుడల్లా వచ్చి, మమ్మల్ని ఓసారి చూచి పోతూండాలిసుమా నాయనా"

"ఆలాగేలెండి"

"మావాడు కనిపిస్తే ఈసంగతంతా చెప్పుతండ్రీ"

"చెప్తానండి"

"నీ మేలెప్పుడూ మేము మరచిపోలేము"

" దానికేమిలెండి. మరి ఇక శలవా "

" దయమాత్రం ఉంచు నాయనా "

" ఎంతమాటా "

" శలవు "

" మంచిది "

మాధవరావు గుమ్మందిగి పది అడుగులు నడిచాడు. లోపలినుంచి ఇందిర పరుగెత్తుకొంటూ తల్లిదగ్గరకు వస్తూ " అమ్మా ఆయన జేబురుమాలు మరచిపోయారు " అంది.

" నాయనా అబ్బాయీ" అని ఇందిర తల్లి కేకవెయ్యగానే మాధవరావు వెనుకకు వచ్చి, " పిలచారా " అని ఆమెను అడిగాడు. " మరేంబాబూ ! నీ జేబురుమాలును మరచిపోయావట. ఇచ్చెయ్యి తల్లీ " అని కూతురుతో అంటే, మాధవరావు తన జేబును తడుముకొన్నాడు. అతని రుమాలు అతని జేబులోనే ఉంది. ఇందిర చేతిలోని జేబురుమాలును చూసి, అతను తెల్లబోయాడు. ఆ జేబురుమాలు తనది 'కాదంటే ఆ అమ్మాయి చిన్నబుచ్చుకుంటుందేమోనని, ఆమె చేతిలోని రుమాలును అందుకోవడానికి చేయి చాచాడు. అప్పు డెందుకో అతని గుండెలు వేగంగా కొట్టుకొన్నాయి. ఇందిర తాను తెచ్చిన జేబురుమాలును అతనిచేతి కందించింది. అప్పుడామె చెయ్యి అతని చేతికి తగిలింది. ఇందిర శరీరమంతటా విద్యుచ్ఛక్తి ప్రవహించినట్లయింది. ఆమె అతని ముఖంకేసి కడసారి చూడాలనుకొంది, కాని సాహసం చాలింది కాదు. తరువాత అతను " బాంమ్మగారూ ! వెళ్ళివస్తాను " అంటే ఆమె " మంచిది నాయనా ! మమ్మల్ని మాత్రం మరచిపోమాకు" అని మరోసారి అంటే అతను ఎంతో ప్రయత్నంమీద ముందుకు

సాగిపోయాడు. కాని మనస్సు మాత్రం వెనుకనే దిగబడి పోయింది. ఇందిర వీధి కిటికీలోనుంచి అతను కనపడేవరకూ జూసి, ఇంట్లోకి వెళ్ళిపోయింది.

మాధవరావు వీలాగున చాలాదూరం నడచిపోయాక, ఇందిర యిచ్చిన జేబురుమాలును జేబునుంచి పైకితీసి. దానిమీద అల్లి బడిన లేసుపనిని జూసి. ఆమె నేర్పరితనాన్ని చాలాసార్లు మెచ్చు కొన్నాడు. ఆ రుమాలునకో మూల 'ఇందిర' అనే అక్షరాలు ముత్యాల్లాగ ఎంతో సొంపుగా కుట్టబడి ఉన్నాయి. "తల్లిని రక్షించినందుకు ఇందిర ఈ జేబురుమాలును నాకు పారితోషికంగా యిచ్చింది కాబోలు. అయితే దానికింత చమత్కార మెందుకు? తల్లితో చెప్పి, నిర్భయంగానే యియ్యవచ్చును కదా! యిది నా జేబురుమాలనీ—నేను మరచిపోయాననీ—యిలా కుత్రిమంగా ప్రకటించి, యివ్వాలనొచ్చిం దెందుకో! ఒకవేళ ఈ విషయాన్ని తల్లితో చెబుతే, "ఈపాటి స్వల్పబహుమానం మన మాతనికి ఇవ్వవలసింది కాదు" అని ఆమె అంటుందేమోనని ఇందిర ఇలా చేసిఉండాలి. పైగా తన స్వహస్తాలతో దాన్ని నా కివ్వ డానికి తల్లి అంగీకరిస్తుందో అంగీకరించదో అని ఆ అమ్మాయి భయపడి ఉంటుంది. ఏ దెలాగున ఉన్నా, ఆమెకు అల్లికపనిలో ఇంత సామర్థ్యం ఉందని నే నింతకుముందు ఎరుగను. ఆమెకు చక్కదనానికి తగినట్లే తెలివితేటలు—చురుకుదనము—ఉండడం చెప్పుకోదగిన విషయం పాపం! ఏమయితేనేం! ఎన్ని ఉంటే మాత్రం ఏమిలాభం? ఆమె అందచందాలు—తెలివితేటలు—వయోగుణాలను చూసి ఎవరు ఆనందించాలో వాళ్లు లేరుకదా! అడవిలోపుట్టి అడవిలో పెరిగి, అడవిలోనే నివసించిపోయే

సుకుమార పుష్పంలాగ—ఆమె హృదయంలో మొలకెత్తి—ఆమె హృదయంలో పెరిగి—ఆమె హృదయంలోనే జీర్ణించి పొయ్యే కోరికలను ఈ పాడుసంఘం గమనించదుకదా! —అమె తన జేబురుమాలును నా కందించేటప్పుడు ఆమెయొక్క మృదు హస్త స్పర్శవలన నా శరీర మెందుకో గగుర్పొడిచింది. ఒకవేళ ఆమె నన్ను ప్రేమించలేదుకదా! నేనో..................."

అని మాధవుడు అనేకవిధాల ఆలోచించుకొంటూ, ఇందిర స్ఫురద్వ్యాపమును—తెలివితేటలను మనస్సులో తలపోసుకుంటూ క్రమంగా సాయంకాలం నాలుగుగంట అయ్యేటప్పటికి, టీతోటను చేరుకొన్నాడు. అతనా తోటలో ప్రవేశించేటప్పటికి కూలీ లందరూ పాటలు పాడుకొంటూ, పనిచేస్తున్నారు. ఆనాటి రాత్రి ఆ వితంతు స్త్రీని హింసపెట్టిన దొంగలా కూలీలలో ఎవరై ఉంటారా, అని మాధవరావు అనేకవిధాల తర్కించుకొంటూ, ఆ తోటకు చేరువనే ఉన్న ఒక బంగాళాలో ప్రవేశించాడు. అక్కడ ఇద్దరు గుమాస్తాలు ఏవో పద్దులు రాసుకొంటూ మాధవరావును చూడగానే లేచి ఆహ్వానించాడు. అతనుకూడా ఒక కుర్చీలో కూర్చున్న తరువాత అరవిందబాబు అనే గుమాస్తా తన కుర్చీని మాధవరావునకు దగ్గరగా లాక్కొని, "నిన్న సాయంకాలమే మీరు వస్తారనుకొన్నాను" అన్నాడు. అప్పుడు మాధవరావుకు, అరవిందబాబుకూ ఈ క్రింది సంభాషణ జరిగింది. రెండవ గుమాస్తా అప్పుడు తన పద్దు పుస్తకాలను మూసి, తోటలో పనిచేస్తూన్న కూలీల దగ్గరకు వెళుతున్నానని చెప్పాడు—

మాధ: నేను నిన్న సాయంకాలమే రావలసింది. కాని—

అర: ఏదయినా తొందరపనివల్ల ఆగిపోయారా?

మాధ : లేదు. బయలుదేరడం నిన్న సాయంకాలమే జరిగింది. మార్గంలో ఇంకో జరూరుపనిలో చొరబడవలసి వచ్చింది. మీతో ఒక రహస్య విషయాన్ని గురించి మాట్లాడాలి.

అర : చిత్తం.

మాధ : ఇక్కడకాదు. వ్రాతకట్టిపెట్టి నాతో రండి. తూర్పు వైపు తోటలోనికి పోదాం. ఇప్పుడక్కడ ఎవరూ ఉండరుకదూ ?

అర : ఉండరు.

అప్పుడు వాళ్ళిద్దరూ లేచి, నిర్మానుష్య మయిన ఒకతోటలో ప్రవేశించారు. అక్కడున్న ఓ పచ్చిక బయలుపైన కూర్చోగానే మాధవు డిలాగున అన్నాడు.

మా : అయితే యిపుడీ తోటలో పనిచేసే కూలీల మొత్తం సంఖ్య ఎంత ?

అర : ఎనిమిదివందల అరవైనాలుగు.

మా : ఈ దినం హాజరుపట్టీ వేశారా ?

అర : వేసానండి

మా : అందరూ హాజరయినారా ?

అర : ఎనమండుగురు మాత్రం రాలేదండి.

మా : వారిపేర్లు చెప్పగలరా ?

అర : పట్టీ చూస్తేనేగాని చెప్పలేను.

మా : నిన్నను హాజరుకానివా రెందరు ?

అర : నలుగురే.

మా : ఈ దినం మరో నలుగురు రాలేదన్నమాట.

అర : మరేనండి.

మా : నిన్నను మానిన నలుగురు, ఈనాడు మానిన ఎనమండుగురలోని వాళ్ళేనా ?

అర : అయివుంటారు.

మా : మన తోటమీదుగా రామనగరం బోయే మార్గం ఉంది చూసారూ ?

అర : అవును ఉంది.

మా : ఆ మార్గంలో రాత్రులు దొంగతనాలు జరుగతవని మీరు ఎప్పుడయినా విన్నారూ ?

అర : (తెల్లబోయి) ఎప్పుడూ వినలేదు. ఏం అలా అడుగుతున్నా రెందుకు ? ఏదయినా ప్రమాదం జరిగిందా యేమండీ ?

మా : మన తోటలో పనిచేసే వాళ్ళలో ఎవరయినా దొంగతనాలకు అలవాటు పడినవాళ్లు ఉంటారంటే మీరు నమ్ముతారా ?

అర : అబ్బెబ్బె ! నే నెప్పుడూ నమ్మనండి. మీ రిలాగు ఎందు కడుగుతున్నారో నాకు తెలియడంలేదు.

మా : మిగిలిన విషయమంతా మీకు తరువాత తరువాత తెలుస్తుంది. కాని మీరుమాత్రం నా మాటలను నమ్మాలి. మన తోటలో పనిచేసే కూలీలలో కొందరు దొంగలున్నమాట వాస్తవం.

అర : నిజం ? నాకీ విషయం చాలా ఆశ్చర్యంగా ఉంది.

మా : ముమ్మాటికీ నిజం—నామాట నమ్మండి.

అర : ఎంత మోసం ! ఎంత ద్రోహం ?

మా : నేను వాళ్ళసంగతిని పూర్తిగా కనుక్కొవి తీరతానండి. ఈ వ్యవహారంలో మీరు నాకుకొంత సాయపడవలసి ఉంది.

అర : ముఖ్యంగా.

మా : తరవాత మీ రప్పుడప్పుడి కూలీలు ఏమేమి చెప్పుకుంటూ ఉంటారో రహస్యంగా వింటూ ఉండండి.

అర : తప్పకుండా ప్రయత్నం చేసి ఆ దుర్మార్గులను శిక్షించాలి. మన తోటలోని కూలీలే ఇటువంటి ఘోరకార్యాలు చేస్తున్నారంటే, మనకెంతఅపఖ్యాతి!

మా : అందును గురించే మనమింత పట్టుదల వహించి ఈ కార్యాన్ని సాధించడానికి పూనుకోవలసి వచ్చింది. చిన్న గుమాస్తాగారయిన గోపీచందుగారితో కూడా మనప్రయత్నమంతా సావకాశంగా చెప్పి, ఆయనగారి సలహాలుకూడా మీరు పుచ్చుకొంటూ ఉండవచ్చును.

అర : అలాగేనండి.

మా : అదుగో గోపీచందుగారు కూడ అప్పుడే వచ్చేస్తున్నారు. ప్రస్తుతం మనమీ సంభాషణను కట్టిపెడదాం.

అర : మంచిది. అలాగునే చేదాము.

మా : గోపీచందు బాబుగారూ! ఇలా కూర్చోండి. మనం కూలీలకు బట్వాడా చేయవలసిన దినం నిన్ననే కదూ!

గో : అవునండి.

మా : ఆ విషయాన్ని గురించి నేను నిన్ననే వద్దామని బయలుదేరాను. కాని వేరే పని ఉండడంవల్ల రాలేకపోయాను. లెక్కలన్ని తయారు చేసారా?

గో : నిన్నటికే తయారయినాయండి. డబ్బుకోసం కూలీలందరూ ఈ ఒక్కరోజు ఆలశ్యానికే గోలచేస్తున్నారు. మీ "పే ఆర్డరు" లేకుండా ఇవ్వడానికి వీలులేదని ఆపుచేసాము. ఈవేళ అయినా ఇచ్చెయ్యాలి.

మా : తప్పకుండా ఇచ్చేయ్యండి. బట్వాడా మొత్తం ఎంత ఈ వారంలో ?

గో : (పుస్తకమును చూస్తూ) రెండువేల నాలుగు వందల అరవై రూపాయలు.

మా : మొత్తం కూలీలలో ఆడవా రెందరు ?

గో : మూడువందలు,

మా : పిల్లలు ?

గో : ఏభై

మా : సరె. ఆ పుస్తకం యిలా ఇవ్వండి పేఅర్డరు వేసి సంతకం చేస్తాను. ఈ పూట బట్వాడా కూలీలకు ఇచ్చెయ్యవచ్చును. నేను ఈ పూటకు ఇక్కడనే ఆగి, ఉదయమే కలకత్తా వెళ్ళిపోతాను.

గుమాస్తా పుస్తకం ఇవ్వగానే, మాధవరావా లెక్కల నన్నింటిని సరిచూచి, "పే ఆర్డరు" వేసి సంతకం జేసాడు. వెంటనే గుమాస్తా ఇనప్పెట్టెలోని రూపాయల నన్నింటిని ఒక సంచితో తెచ్చి బల్లమీద పెట్టి కూర్చున్నాడు.

ఇంతలో తోటలో ఆరుగంటలు కొట్టారు. వెంటనే కూలీలందరూ ఎక్కడపని అక్కడే వదిలేసి బిలబిల బంగాళావైపు వస్తున్నారు. అప్పుడు మాధవరావు గోపీచందును జూసి, "కూలీలందరూ వస్తున్నారండోయి! బట్వాడాకు సిద్ధంగా ఉండండి" అన్నాడు. గోపీచందు గూడా సర్దుకు గూర్చున్నాడు. ఇంతలో కూలీలందరూ వచ్చి, బంగాళాచుట్టూ మూగారు, అప్పుడు గోపీచందుబాబు ఆ గుంపు నుద్దేశించి, "ఇప్పుడు మీ కందరకు బట్వాడా ఇయ్యాబడుతుంది. పేర్లవరసగా ఒక్కరొక్కరే వచ్చి

సొమ్ములు పుచ్చుకు వెళ్ళండి" అని పట్టీలోని పేర్లను వరుసగా చదువుతు, ఇవ్వవలసిన మొత్తం చెబుతుండగా అరవిందబాబు ఆజ్ఞను చెప్పిన మొత్తాని ఆయా కూలీల చేతుల కందిస్తున్నాడు. పిలువబడుతూన్న పేర్లవారీగా కూలీలందరూ ఒక్కొక్కరే వచ్చి, తమకు రావలసిన కూలినందుకొని వెళ్ళిపోతున్నారు. మాధవరావు ఆ వచ్చిన ప్రతికూలీ ముఖంవైపునా పరకాయించి చూచాడు. అందరి ముఖాలూ గూడా నిర్దోషత్వమును—అమాయికత్వమును మాత్రమే సూచించడంవల్ల, అతను అందులోనివాళ్ళెవరను, అనుమానించ లేక పోయాడు. క్రమంగా కూలీలందరూ బట్వాడాలను తీసికొని ఎవరిమట్టుకు వారు వెళ్ళిపోయారు.

ఆ మరునాటి ఉదయమే మాధవరావు అరవిందబాబుతో ఏమేమో రహస్యంగా మాటాడి, కలకత్తాకు ప్రయాణమై వెళ్ళిపోయాడు. మార్గంలో అతని హృదయాంతరాళంలో అనేకములయిన ఆలోచనలు చెలరేగి, అతని హృదయాన్ని చాలా కలవరపరచాయి. జరిగిన సమాచారము నంతను టీ తోటకుమ తనకును యజమాని అయిన రమేశచందుగారితో చెప్పడమా, చెప్పకపోవడమా, అనేది మొదటి ఆలోచన. తన్ను ఎక్కువగా ప్రేమించినట్లు కనబడుతూన్న ఇందిరవిషయంలో తా నెలాగున ప్రవర్తించాలి? అనేది ఇంకో ప్రశ్న. తరవాత టీ తోటలో ఉన్న దుర్మార్గులను తెలిసికొని, వాళ్ళ నెట్లాగు నయినా శిక్షించకపోతే ఎప్పటికయినా ప్రమాదంకాదా? అనేది ఇంకో చిక్కుప్రశ్న. అయితే ఆ వంచకులను ఎలాగున తెలిసికోవడమా అనేది మరియొక సమస్య. ఇలాగున అతను పరిపరి విధాల ఆలోచించుకొంటూ, కలకత్తాలోని రమేశచందుగారి బంగాళా చేరుకొన్నాడు.

## 4

వెంటనే మాధవరావు రమేశచందుగారి యనుమతి ననుసరించి, మోటారు బండిపై ప్రయాణమై నెం 364 రు గృహముకడకు పోనిమ్మని డ్రైవరుతో చెప్పాడు. కొంతసేపటికి మోటారు సుదర్శన రావుగారి మేడ కెదురుగా నిలిచింది. మాధవరావు కారును దిగి, ఆ భవనములోనికి ప్రవేశింపగా, అప్పుడే ఫ్యాక్టరీకి పోయే హంగు మీదనున్న సుదర్శను డాతనిని లోనికాహ్వానించి, ఒక పేము కుర్చీలో కూర్చుండ నియమించి, " నాతో యేమయినా జరుగురు పని ఉండడంవల్ల యిలా దయచేసారా " అని అడిగాడు. అప్పుడు మాధవరావు జరుగురుపని ఏమీ లేదనిచెప్పి, తరువాత క్రమంగా, జరిగిన సమాచారమంతా చెప్పి అతని సోదరి ఎటువంటి అపాయ మును చెందకుండా సురక్షితంగా రామనగరం చేర్చబడినట్లు తెలియజేసాడు. ఈ వర్తమానమునంతను విన్న సుదర్శనరావు తన అక్కగారయిన సత్యవతమ్మకు దొంగలవల్ల ఈ ఉపద్రవం జరిగినందుకు మొదట తొట్రుపాటు నందాడు. కాని క్రమంగా మాధవుని మూలమున సంగతి నంతను ఆమూలాగ్రంగా తెలిసి కొని, ఆమెకు ఎటువంటి ప్రమాదమును సంభవించలేదని గ్రహించిన తరువాత స్వస్థతను జెందాడు. తమకట్టి గొప్ప యుప కారము జేసినందుకు మాధవరావును అనేక విధాల పొగడి, తన కతనితో స్నేహం వృద్ధిచేసుకోవాలని ఉన్నట్లు చెప్పాడు. దానికి మాధవరావుకూడా చాలా సంతోషించి, అప్పటికి అతని దగ్గర శలవు తీసికొని, వెళ్ళిపోయాడు.

అరవిందబాబుకు సుమారు పాతిక సంవత్సరాలు గడచి ఉంటాయి. అతడు స్నేహపాత్రుడు—యోగ్యుడూను. అతడు

వుద్యోగము లేక చిక్కులుపడే దినాలలో మాధవరావు ఇతని పరిస్థితికి జాలివహించి. రమేశచందుగారితో గట్టిగా చెప్పి, సిఫార్సు చేసి, అరవిందబాబుకు ఏదయినా ఉద్యోగం కల్పించక తప్ప దన్నాడు. రమేశచందుకు మాధవరావు యందుండే అభిమానము చేతను—ఆదరమువల్లను, అరవిందబాబుకా టీ తోటలో వెంటనే అరవై రూపాయిల ఉద్యోగం దొరికింది. అరవిందబాబు స్వతహా యోగ్యుడు. పైగా తన కిటువంటి ఉపకారం చేసిన మాధవరావును అధికగౌరవంతో చూస్తూ ఎంతో విశ్వాసపాత్రుడై మెలుగుతూ ఉండేవాడు.

అరవిందబాబు ఉద్యోగంలో ప్రవేశించే టప్పటికే గోపీ చందు పనిచేస్తున్నాడు. ఇతనికి సుమారు ముప్ఫయి సంవత్సరా లుండవచ్చు. గుణాలలో ఇతనికీ, అరవిందబాబుకూ చాలా తేడా వుంది. నడవడిలోగూడా అంతే. అరవిందబాబు ముఖం చూసే టప్పటికే, అతనియందొక పూజ్యభావము—గౌరవమూ కలుగు తుంది. గోపీచందును చూడగానే అతని నడవడిని—గుణాలను శంకింపవలసి వస్తుంది. అరవిందబాబుతో వయినా గోపీచందు అంతగా చనువుగాను—స్నేహంగాను మసలుతూ ఉన్నట్లు కన పడదు. ఆఫీసుపనిలో అవసరం కలిగినప్పుడు మాత్రం తప్పని సరిగా మాట్లాడుకొంటూ ఉండడం కలదు.

మన టీ తోటలో పనిచేసే కూలీలలో దొంగలున్నారనీ. వాళ్ళ నెట్లాగునయినా పట్టి బంధించాలనీ, మాధవరావు చెప్పి వెళ్ళినప్పటినుంచీ, అరవిందబాబుకు ఏమాత్రమూ మనస్థిమితము లేకుండా పోయింది. ఆ దుర్మార్గులెవరో కనుక్కుందామని అతను

అనేక విధాల ప్రయత్నం చెయ్యడం మొదలుపెట్టాడు. అనేక సార్లు కూలీలు మాట్లాడుకొనే మాటలను రహస్యంగా పొంచిఉండి విన్నాడు. పోనీ ఈ సంగతి నెవరితో నయినా చెప్పి, తనకు సాయం చెయ్యమని అడుగుదామన్నా, అందరిలోనూ ఎవరిని నమ్మాలో, ఎవరిని నమ్మగూడదో అతనికి బోధపడకుండా ఉంది.

ఒకనాటి సాయంకాలం కూలీలందరూ ఎవరిమట్టుకువాళ్లు వెళ్ళిపోయారు. అరవిందబాబు ఒక్కడూ ఆఫీసుగదిలో కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు. మాధవరావు వెళ్ళి అప్పుడే నాలుగురోజు లయింది. ఇంక మూడురోజులలో వారమవుతుంది. బట్వాడానాటికి అతను తిరిగి వస్తాడు. అతను వచ్చినప్పుడు దొంగలను పట్టుకోవడానికి తాను జేసిన ప్రయత్నాన్ని అతని కేవిధంగా తెలుపుడు చెయ్యాలో బోధపడక వివిధరీతులగా తలంచడం మొదలుపెట్టాడు. పోనీ ఈ విషయాన్ని, తనతో సమానోద్యోగుడును, తానుమర్యాదస్థుడుగా యెంచుచున్నవాడును, అయిన గోపీచందుతో చెబితే ఏమయినా పనిజరిగి, కూలీలలో కలిసిపోయి ఉన్న దుర్మార్గుల సంగతి కొంతవరకు అయినా తెలియగలదని అభిప్రాయపడ్డాడు. కాని గోపీచందు ఈవిషయంలో తన కెంతవరకు సాయపడతాడు? అతను సాయపడితే తన కేమయినా లాభం కలుగుతుందా? దొంగల భోగట్టా యేమయినా తెలుస్తుందా? అనే విషయాలు ప్రయత్నించిన మీదటగాని తెలియవని అతను నిర్ధారణ చేసాడు. అదే సమయంలో గోపీచందు ఆఫీసు గదిలో ప్రవేశించి,

"ఏమండీ అరవిందబాబుగారూ! ఏమిటో దీర్ఘంగా ఆలోచిస్తూన్నట్లు కనబడుతుంది" అన్నాడు.

" అబ్బే! ఏమీలేదు. వ్రాతపని అంతా పూర్తిఅయింది. ఈవారం పని బాగాజరిగింది. మనలను మాధవరావుగారు మెచ్చు కొని తీరుతారు "

" ఎక్కువమంది కూలీలను పెట్టాము కాదటండీ, వారం రోజులలో అయ్యేపని నాలుగు రోజులలో పూర్తిఅయింది. ఈ వారం కూలీలబిల్లు మామూలుకు ' డబుల్ ' అవుతుందనుకుంటా"

" అవుతే నేమిలెండి యీ మధ్యాహ్నమే రొక్కమంతా వచ్చి చేరింది, ' సేఫ్ ' లో పెట్టాను. ఇంతవరకూ జరిగినపనికి లెక్కలుగూడా తయారయ్యాయి "

అని వాళ్ళిద్దరూ మాటాడుకొనే సమయంలో ఎవరో ఒక చెంబును చేతబట్టుకొని, ఆ ఆఫీసు గది ముందునుంచే వెళ్లారు. ఆ వ్యక్తిని చూసి అరవిందబాబు, గోపీచందుతో " వారెవరండీ! మీ గదివైపు వెళుతున్నట్లుంది " అన్నాడు. అప్పుడు గోపీచందు " వాడు మాకు పాలుతెచ్చే మనిషిలెండి ఈ పూట సాయంకాలం కూడా పాలుకావాలని చెప్పడంచేత పట్టుకుని వచ్చాడనుకుంటా. అదేమిటో ఈ పూట చాలా ' టీడియస్ ' గా ఉన్నదండీ. కాస్సేపు తోటవైపు నడచి, మంచిగాలిని పీలుద్దామని వుంది. వస్తారా " అన్నాడు.

అర : నాకూ అలాగేవుంది. తప్పకుండా వస్తాను. మరి తలుపులన్నీ తాళాలు వెయ్యడానికి కొంచమాలస్య మవుతుందను కుంటాను.

గోపీ : ఎందుకండీ " కేష్ " రూము ఒక్కటీ మాత్రం తాళంవేసి రండి. మిగతావన్నీ కాగితాలు, పుస్తకాలే కదూ ఎవరికావాలి?

అర : అవునలాగే చేదాము. ఈ చుట్టుప్రక్కలే తిరుగుతూ ఉంటాము కదూ.

అని అరవిందబాబు అనుకున్న గదికిమాత్రం తాళంవేసి, మిగతా తలుపులు ఓరిగిలవేసి, గోపీచందుతో షికారు బయలు దేరాడు. మార్గంలో వాళ్ళిద్దరకూ యీ క్రింది సంభాషణ జరిగింది.

గోపీ : చాలాదూరం నడవలేమండి. ఇక్కడనే కాస్సేపు కూర్చుందాము. మంచిగాలి కూడా వేస్తూంది.

అర : పోని ఇక్కడనే గూర్చుందాము. బాగానేవుంది. మన ఆఫీసుకు దగ్గరగాకూడా వుంటుంది.

ఇద్దరూ అక్కడున్న ఓపచ్చిక బయలుమీద గూర్చున్నారు, తరువాత—

గోపీ : మాధవరావు యోగ్యుడు—పరోపకార బుద్ధికల వాడూ నుమండీ! మీరు కనిపెట్టారో లేదో ?

అర : మీరు చెప్పినది యెదార్థమని నేనూ వప్పుకుంటాను. నేను ఉద్యోగం లేక మహా దీనావస్థలో ఉండే రోజుల్లో, రమేశ చందుగారికి గట్టిగా సిఫార్సుచేసి, నాకీ యుద్యోగ మిప్పించారు.

గోపీ : అది సరేలెండి, ఆయన మొన్న ఇక్కడకు వచ్చి నప్పుడు జరిగిన విశేషం మీ రెరుగరనుకుంటా ?

అర : అదేమిటండి ?

గోపీ : ఆయన ఇక్కడకు వచ్చిన రాత్రే, మార్గంలో ఎవరో స్త్రీని దొంగలు కొట్టారట. అప్పుడు మాధవరావుగారా దొంగలను పారదోలి, ఆ స్త్రీని రక్షించి, ఇక్కడకు సమీపంలోనే ఉన్న ఆమె గ్రామం, రామనగరం స్వయంగా తీసికొనిపోయి విడిచి వచ్చారట.

అర : ( తెల్లబోయి ) ఈ విషయమంతా మీ రెలాగున ఎరుగుదురు ?

గోపీ : రామనగరంలో నేనీ వార్తను విన్నాను.

అర : మీరు రామనగరం వెళుతూ ఉంటారా ?

గోపీ : అప్పు డప్పుడు—అక్కడ మాకు కావలసిన బంధుగు లున్నారులెండి.

అర : అలాగునా ?

గో : ఆ గ్రామంలోనే నాకీ విషయమంతా తెలిసింది. అక్కడ మాధవరావుగారి ఉపకారబుద్ధిని–ధయిర్య సాహసాలను కొనియాడనివారు లేరు.

అర : ఉహూఁ !

గోపీ : నిజంగా ఆయన ఉదారతను కొనియాడవలసిందే.

అర : అవును.

గోపీ : ఆయన సౌందర్య రూపానికి తగినట్లె, సద్గుణాలు గూడా అబ్బడం, బంగారానికి సువాసన అబ్బినట్లు కాదూ ?

అర : మీరు చెప్పిందాల్లో అణుమాత్రమయినా అతిశయోక్తి ఉండదు. అయితే—నాకు తెలియక అడుగుతాను మన తోటమీదుగా రామనగరం పోయే మార్గంలో దొంగలభయం ఉన్నదన్నమాట.

గోపీ : ఇటువంటి వింత సమాచారాన్ని వినడం నాకిదే మొదటిసారి. ఇంతకుముం దెప్పుడూ వినలేదు.

అర : ఓహో ! అలాగునా

గోపీ : అదీకాకుండా, ఈ మార్గంలో దొంగలెక్కడుంటారో నాకు తెలియడంలేదు.

అర : మన తోటలో పనిచేసే వాళ్ళలోనే అటువంటివా శ్ళెవరయినా కొందరుంటే ఉండాలి.

గోపీ : అమ్మమ్మా ! ఎంతమాటా. మీరు నిన్నగాక మొన్న నొచ్చారు. వాళ్ళ విషయం మీకు అంతగా తెలియదు. మన కూలీలవంటి నమ్మకస్థులూ, యోగ్యులూ మరెక్కడా ఉండరంటే నమ్మండి. వాళ్ళలో ఇటువంటి వంచకు లుంటారనడం పొరబాటు. మీకే నెమ్మదిమీద అంతా బోధపడగలదు.

అర : మీరు చెప్పినది యదార్థమే కావచ్చును. అయితే, ఆ పని ఎవరివల్ల జరిగి ఉంటుందంటారు ?

గోపీ : అదే నేనూ ఆలోచిస్తున్నాను. మనం ప్రయత్నం చేస్తే, యెదార్థవిషయం తెలియకపోదు.

అర : మీకా ధయిర్యం ఉంటేచాలు. మనమా దుర్మార్గులన్ను ఎలాగునయినా పట్టుకొని, యిక ముందునుంచి అయినా, ఈ మార్గంలో అటువంటి ఘోరకార్యాలు జరుగకుండా చెయ్యాలి.

గోపీ : మీకు అటువంటి తీవ్రమయిన పట్టుదల వుంటే, తప్పకుండా ప్రయత్నంచేదాము.

అర : మనం తలుచుకొంటే ప్రయత్నం కొనసాగకపోదు.

గోపీ : నాకు కూడా ఆ ధయిర్యముంది.

అర : మన మిద్దరమూ ఒక ఆఫీసులోనే ఉద్యోగస్థుల మయినందుకు—స్నేహితుల మయినందుకు—ఈ సమాచారం మూడో కంటివాడికి తెలియగూడదు.

గోపీ : ఎంతమాటా ? ఆ సంగతిని మీరు మళ్ళీ అనాలా.

అర : ఇంక వెళ్ళిపోదామా ?

గోపీ : అవును. చాలా పొద్దుపోయినట్లుంది. ఇకలేద్దాము.

అరవిందబాబూ, గోపీచందు, తాము కూర్చున్న ఆ పచ్చిక మీదనుంచి లేచి, ఆఫీసు గదివైపు నడచారు. మార్గంలో ఎవరూ కూడా మాటాడలేదు. బంగాళాను చేరిన వెంటనే గోపీచందు, అరవిందబాబుదగ్గర శలవు పుచ్చుకొని వెళ్ళిపోయాడు. కుర్చీలో కూర్చుని పరధ్యాహ్నంగా ఆలోచిస్తూన్న అరవిందబాబు దృష్టి, అక్కడ బల్లమీదనున్న తాళపుచెవులగుత్తిపై పడింది. "గది తాళంవేసి, తాళాలు ఇక్కడనే మరచిపోయాను కాబోలు" అని అనుకొని వెంటనే 'కాష్‌రూమ్' తాళాలను కోటుజేబులో వేసుకొని, ఆ దాపులోనే ఉండే తను నివసించే బంగాళాకు వెళ్ళిపోయాడు.

రమేశచందుగారి టీ తోట చూడడానికి ఎంతో రమ్యంగా ఉంటుంది. రెండువందల యెకరాలకు పైవిస్తీర్ణం కలిగి, ఏపుగా పెరిగిన టీ మొక్కలతో కన్నుల పండువగా వుంటుంది. ఆ తోటకు ఆనుకొని నాలుగు బంగాళాలు వున్నాయి. పెద్దబంగాళాలో ఆఫీసు పెట్టారు. అక్కడ పనిచేసే వాళ్ళలో అరవిందబాబూ, గోపీచందూ, ప్రధానమైన ఉద్యోగులు వాళ్ళిద్దరూ అక్కడున్న చెరొక బంగాళాలోనూ నివసిస్తూ ఉంటారు. నాలుగో బంగాళా ఎప్పుడూ ఖాళీగానే ఉంటుంది. మాధవరావు ప్రతివారము బట్వాడాలు ఇచ్చే రోజుకు కలకత్తానుంచి వచ్చి, ఈ బంగాళాలోనే ఒక పూటో, ఒకరోజో వుండి, లెక్కలను తనిఖీచేసి, బట్వాడాలను యిప్పించి, తిరిగి కలకత్తా వెళ్ళిపోతూ వుంటాడు. రమేశచందు గారు నెలకొకసారి మాత్రం వచ్చి, వ్యవహారాల నన్నింటిని స్వయంగా చూసుకొని, ప్రతినెలా కావలసిన పనుల నన్నింటిని బెత్తాయించి, తిరిగి ఆనాడే కలకత్తా వెళ్ళిపోతుండేవారు. కాని మాధవరావు ఉద్యోగంలో ప్రవేశించి నప్పటినుంచి, అన్ని

వ్యవహారాలను అతనే తృప్తికరంగా చేయిస్తూ ఉండడంవల్ల రమేశచందుగారు తమ పూర్వపు అలవాటును తప్పించుకొని ఏ మూడు నాలుగు నెలలకోగాని తోటవైపునకే రాకుండా మానే శాడు. మాధవరావు సర్వ సమర్థతతోనూ, వ్యవహారాల నన్నింటిని చక్కపెడుతూ, తనకంటె చురుగ్గా పనిచేయిస్తూ ఉన్నప్పుడు తన తోటకు వెళ్ళి, కలకత్తాలోని పనిని ఎందుకు పాడుజేసుకోవాలి అనుకున్నాడాయన.

మాధవరావు రమేశచందుగారికి నమ్మినబంటు. డబ్బుపెత్తనము-కూలీలపై సర్వ హక్కులు-అవసరమయినప్పుడు కొత్త ఉద్యోగస్తులను వేయడము—అవసరం లేనప్పుడు ఉన్నవాళ్ళను తీసెయ్యడము-మొదలయిన సర్వహక్కులు మాధవరావువే అయివున్నై. మాధవరావుతో సంప్రతించకుండా రమేశచందుగారు ఏ ఇతర వ్యవహారమయినా చేయడం అలవాటు లేదు. అన్నివిధాలా మాధవరావు తన యజమానికి తలలోని నాలుకవలె మెలగుతు, యెంతో విశ్వాస పాత్రుడుగా ఉంటున్నాడు. ఇటువంటి పరిస్థితుల్లో తన యాజమాన్యములో ఉన్న టీ తోటకు చెడ్డపేరు వచ్చినందుకు మాధవరావు చాలా కించపడుతున్నాడు. తమ తోట కూలీలలో దొంగలు—ద్రోహులు ఉన్నారని తెలియడంతోనె అతను సహించలేక పోయినాడు. ఎలాగునయినా ప్రయత్నంచేసి ఆ దుర్మార్గులను పట్టి శిక్షించాలని బద్ధకంకణుడై వున్నాడు. ఈ విషయమై అరవిందబాబుతో కూడా చెప్పాడు, అరవిందబాబుకు మాధవరావు యందు యజమానియం దుండు అణకువ—భక్తిభావములే గాకుండా, అమితమయిన మిత్రభావము గూడా, ఉంది. అందు చేత అతనుకూడా, తోటలోని దుర్మార్గులను పట్టడానికి నిశ్చ

యించాడు. ఈ విషయమంతా గోపీచందు అంతకుముందే యెరిగి వుండడంచేత, అతని సహాయాన్ని గూడా కోరాడు. గోపీచందు తప్పకుండా దొంగలను పట్టె ప్రయత్నంలో సాయం చేస్తానని మాట యిచ్చాడు.

వాడుకప్రకారం మాధవరావు బట్వాడా తేదీకి సరిగ్గా తోట జేరుకొన్నాడు. అతను వచ్చేటప్పటికి గోపీచందు ఆఫీసులో లేడు. అరవిందబాబు మాత్రం తన స్థానంలో గూర్చొని, పూర్తికాబడిన లెక్కలను సరిజూసు కొంటున్నాడు. మాధవరావును జూడగానే లోనికాహ్వానించి, "మీ కోసమే ఎదురు జూస్తున్నాము. లెక్కలన్నీ పూర్తి కాబడ్డవి" అన్నాడు.

మా : ఈ వారంలో పని బాగా జరిగివుండాలి.

అర : ఆహా, రెండువారాలలో జరుగవలసిన పని అంతా ఒక్క వారంలో జరిగింది.

మా : అంతమంది ఎక్కువ కూలీలను పెట్టకపోతె ఈ పని జరిగివుండదు.

అర : ఎలాగున జరుగుతుందండీ ?

మా : సరె. ఈ వారం బట్వాడా చెయ్యవలసిన మొత్త మెంత ?

అర : మూడువేల ఆరువందలు.

మా : మొన్న మీ ఆఫీసుకు జేరిన మొత్తం మూడువేలే కదూ ?

అర : అవును.

మా : ఇప్పుడు నేను మరోవెయ్యి తెచ్చాను. ఆ లోటును పూర్తిజేసి, మిగతా సొమ్మును ఆఫీసులో డెపాజిట్టుగా ఉంచండి. స్వంతకాలు చెయ్యవలసిన కాగితాలు యివ్వండి.

అని మాధవరావు అనగానే అరవిందబాబు కొన్ని కాగితా లను మాధవరావున కందించాడు. మాధవరావు తాను తెచ్చిన వెయ్యిరూపాయల నోట్లను బల్లమీద ఉంచి, తాను సంతకాలు చేయవలసిన చోట చేసి "ఆరు కావస్తూంది. కూలీలందరూ వస్తుంటారనుకుంటూ గోపీచందుగారు ఎలా వెళ్లారు" అని అడిగాడు.

"ఒకగంట అవుతుంది. బసలోకి అని వెళ్లారు. ఇంకా రాలేదు" అని చెప్పి అరవిందబాబు కేష్‌రూము తాళాలనూ, ఇనప పెట్టె తాళాలను తీసికొని, సొమ్మును తేవడానికి లేచాడు. అప్పుడు మాధవరావు మాత్రమే గదిలో ఉంది "ఇతను నేను చెప్పిన విషయమై ఎంతవరకూ ప్రయత్నించాడో, కూలీలలోని మోస గాంత్ర విషయమై ఏమయినా తెలిసిందేమో" అని ఆలోచించు కొంటూ ఉండగా, అతని దృష్టి అప్రయత్నంగా అక్కడ గోడకు చక్కని దంతపుపిడిలో అమర్చబడి, తగిలింపబడిన పులిగోళ్లపై పడింది. వెంటనే అతను కుర్చీలోనుంచి లేచి మేకును తగిలింప బడియున్న ఆ పులిగోళ్ళను దీసి, వాటియొక్క రమణీయతకును, వాటినా దంతపుపిడిలో అమర్చిన పనివాని తెలివితేట్లకును ఆశ్చర్య పోతున్నాడు. ఇంతలో కేష్‌రూము లోనికి వెళ్ళిన అరవిందబాబు "ఘోరము—సర్వనాశనము" అని ఒక పెద్ద అరపును అరచి, తల మోదుకొంటూ వణికిపోతూన్న చేతులతో మాధవరావు దగ్గ రకు వచ్చాడు. అతని వింతచర్యలను చూసేటప్పటికి మాధవరావు నకు గూడా గుండె చెదరిపోయింది. నోట మాటరాలేదు. అరవింద బాబు చేష్టలు జూస్తే అతనికి గూడా భయం కలిగింది. కొంత సేపటికి ఎలాగో ధయిర్యంచేసి "ఏమండీ మీ చేష్టలేమీ నాకర్థం

కావడంలేదు. జరిగిన ప్రమాద మేమిటో చెప్పండి " అన్నాడు. అరవిందబాబు చలించిపోయ్యే కంఠంతో—కంపించే శరీరంతో "మోసము—కుట్ర—దారుణము. ఇనపపెట్టెలోని కేష్ మాయమై పోయింది " అని వట్టిసంచిని బల్లమీద బోర్లించాడు. అది వినిన మాధవరావు తెల్లబోయాడు. అతని శరీరంమీద పిడుగుపడినట్ల యింది. " మూడువేల రొక్కము—పాతికా పరకా కాదు " అని శూన్య దృష్టులతో అరవిందబాబు ముఖంవైపు చూడడం మొదలు పెట్టాడు,

" బాబూ! మీ పాదాల సాక్షిగా నే నేపాపమూ ఎరగను. సర్వనాశనము అయింది. తాళాలు తాళాలలాగనే వున్నాయి. లోపలి రొక్కం మాత్రం మాయమయింది. ఇంతకంటె నేనేమయినా యెరిగివుంటె నా తల బ్రద్దలై పోవాలి—నా నాలుక చీలుకొని పోవాలి " అని కంట తడిపెట్టుకోవడం మొదలు పెట్టాడు.

" అరవింద బాబుగారూ! మీరు ఖంగారు పడకండి. స్థిమిత పడండి. ఎలాగో ప్రమాదం జరిగింది. దాన్ని మనం తెలివితేటల చేత భేదించాలి. కాష్‌రూము లోనికి వెళ్ళి చూదాం పదండి " అని ఊరడి వాక్యాలతో మాధవరావు అనగానే అరవిందబాబు అతనితో కలసి కేష్ రూములోనికి వెళ్ళాడు.

అక్కడ ఇనపపెట్టె చెక్కుచెదరకుండా వుంది తాళాలు కూడా మంచిస్థితిలోనే ఉన్నాయి. గదికి వేయబడిన తాళాలను గూడా మాధవరావు పరీక్షించి జూసాడు. ఎక్కడా అనుమానం లేకుండా అన్ని మంచిస్థితిలోనే ఉన్నాయి, మాధవరావునకు ఏమీ బోధపడిందికాదు. ఎవరిని దోషులుగా యెంచడం? ఎవరిని శిక్షించాలి? మూడువేల రొక్కం ఎవరు పెట్టుకుంటారు? ఇప్పుడు

బట్వాడా యియ్యకపోతే కూలీలందరూ గోలజేస్తారే. ఏమిటి చెయ్యడం ? అనే ఆలోచనలన్నీ మాధవరావు బుర్రలో ఒక్కసారి పరుగెత్తాయి. అతను పిచ్చివాడిలాగ తిరిగి ఆఫీసు గదిలోకి వచ్చి కూలబడ్డాడు. అరవిందబాబు ఖిన్నవదనుడై అక్కడ నిలుచున్నాడు. రెండు నిమిషాలు ఎవ్వరూగూడా మాట్లాడలేదు. తరువాత—

" అరవింద బాబుగారూ ! కేష్ మీ ఆధీనంలోనిది పోయిందికనుక నేరానికి మీరే సమాధానం చెప్పవలసి వుంటుంది.

" అందుకు నేను కాదనను "

" నిజస్థితి ఏమయినా వుంటె యిప్పుడే చెప్పెయ్యండి. కార్యం మించిన తరువాత విచారించినా ప్రయోజనంవుండదు "

" పోయిన డబ్బుకు నేను ఉత్తరవాదిని అయినమాట వాస్తవమే. కాని నాలోయెటువంటి మోసంగాని—పాపపు తలంపు గాని లేదు. నేను ద్రోహిని ఎంతమాత్రము కానని దేవుడి ముఖం జూచి చెబుతున్నాను. ఇది ఎలాగునజరిగిందీ ఆ భగవంతు డొక్కడికి మాత్రమే తెలియాలి. ఇదంతా ఏదో మహా మాయగా వుంది "

" మీరు నిర్దోషులయితే కావచ్చును. కాని, ఇది ఎలాగున జరిగిందో మీరు చెప్పగలరా "

" ఎలాగున చెప్పగలను స్వామీ ! పోనీ నా అశ్రద్ధవల్ల జరిగిం దనడానికయినా, అన్నిటికీ తాళాలు బహు భద్రంగా వేయబడి ఉన్నాయి జూసారుకదూ "

" పోనీ మీ కెవరిమీదయినా అనుమానం ఉందా "

" లేనిమాట ఎక్కడనను స్వామీ "

అని యీ విధంగా అరవిందబాబూ, మాధవరావు ఖంగారు పడుతూన్న సమయంలో అక్కడకు గోపీచందు వచ్చి, వాళ్ళ ముఖాలను జూడగానే తెల్లబోయి "ఏదో ప్రమాదం సంభవించి నట్లు యిలాగున ఖంగారు పడుతున్నారెందుకు" అని అడిగాడు. అప్పు డరవిందబాబు దీనవదనంతో "అయ్యా! సర్వనాశనము జరిగినది. ఇనుపపెట్టెలో పెట్టిన మూడువేల రూపాయల రొక్కము మాయమైపోయింది. ఇంతకంటే ఇంకేమి ప్రమాదము జరగాలి" ఆ మాటలను వినిన గోపీచందు మరింత భయంతో, కంపించిన శరీరంతో "ఎంతమోసము? ఎంత దారుణమయిన మాట విన్నాను. మాధవరావుగారూ! మన కూలీలలో దొంగ లున్నమాట వాస్తవంఅని దీనినిబట్టి నిర్ధారణ చేయవచ్చు వెంటనే అందర కూలీలను అరష్టు చేయించండి. ఈనాడు ఇది జరిగింది. రేపు ఇంతకంటె ప్రమాదమయిన విషయం జరుగుతుంది. మనం అశ్రద్ధచేసి వూరుకొనడానికి వీలులేదు" అన్నాడు.

మాధ : గోపీచందుగారూ! ఈపని ఎవరివల్ల జరిగి ఉంటుందంటారు? చాలా ఆశ్చర్యంగా వుంది సుమండీ! ఎటు వేసిన తాళాలు అట్లేవున్నాయి, డబ్బుమాత్రం మాయమైపోయింది.

గోపీ : ఇటువంటి వింత ఎన్నడు జరిగివుండలేదు. ఇంత కాలంనుంచి ఇక్కడ పని చేస్తున్నాను. ఒక్కపూచిక పుల్లఅయినా పోవడం ఎరుగను. మనతోటలో పనిచేసే కూలీలలో ఎవరో కొందరు దుర్మార్గులు ప్రవేశించి వుండాలి. అరుగో వాళ్ళందరూ ఇటే వస్తున్నారు బట్వాడాలకోసం.

మాధ : అరవింద బాబుగారూ అయిందేదో అయింది. మీరు తొందరపడి వాళ్ళను ఏమీ వాత్తిడి చెయ్యకండి. ప్రస్తుతం

ఇప్పుడు నేను తెచ్చిన వెయ్యి రూపాయలను వాళ్ళకు సరిపెట్టి, మిగతా సొమ్ము రేపు యీయబడుతుందని చెప్పి పంపివెయ్యండి. తరువాత మనం స్థిమితంగా జరుగవలసిన విషయాన్ని గురించి ఆలోచిద్దాము.

అర : చిత్తం! మీరునాకు మొదటినుంచీ, అన్నం పెడుతూన్న తండ్రులు.

ఇంతలో కూలీలందరూ బంగాళాచుట్టూ మూగారు. అరవిందబాబు వాళ్ళకు చెప్పవలసిన రీతిగా చెప్పి ఉన్న రొక్కమును మాత్రం వాళ్ళందరకూ పంచి, మిగతా సొమ్ము ఆ మరునాడీయ బడుతుందని చెప్పి పంపేసాడు. యజమాని అయిన మాధవరావు ఎదురుగుండా ఉండడంవల్ల కూలీలందరూ మారు పలుకకుండా యిచ్చినంతవరకు డబ్బును పుచ్చుకొని, యెవరిమట్టుకు వాళ్ళు వెళ్ళిపోయారు. మాధవరావు తాను బసచేసే బంగాళాలోకి వెళ్లబోతూంటే, గోపీచందు, అరవిందబాబు, ఆతన్ని అనుసరించారు.

## 5

"అమ్మా! మొన్న మన యింటికొచ్చారూ, ఆయన పేరేమిటీ!"

"ఎవరు తల్లీ వారు"

"ఆ! ఆ వేళ రాత్రి నువ్వు కలకత్తానుంచి వస్తుంటే నిన్ను రక్షించారూ, ఆయన"

"ఓహో! ఆయనా! మాధవరావుగారు. దేవుడల్లే ఆనాడు నా కాయన ప్రత్యక్షం కాకపోతే, నేనీపాటికి కెటువంటి చిక్కుల్లో ఉండేదాన్నో"

"అయితే వాళ్ళు బ్రాహ్మలేనుటే"

" అయ్యో! వాళ్లు మనవాళ్ళేనమ్మా! మీ మామయ్యను కూడా ఆయన బాగా ఎరుగునట "

" ఉహూ(. "

" ఎంత బుద్ధిమంతుడమ్మా ఆయన "

" అయితే ఆయన్ని మళ్ళీ ఎప్పుడయినా వస్తూ ఉండమని అన్నిసార్లు చెప్పా వెందుకమ్మా "

" వెర్రితల్లీ! అతను రమ్మంటే మాత్రం వస్తాడు టే. ఏదో బుద్ధిమంతుడు, నా ప్రాణాలను రక్షించాడు కదా అని అలాగున అన్నాను. అటువంటి యోగ్యులతో పరిచయభాగ్యం కలిగినందుకు మనం చాలా గర్వించాలి "

" ఆయనదిగూడా మామయ్య ఉండే కలకత్తాయే అన్న మాట "

" అవును "

" మరి. మనం కొద్దిరోజుల్లో కలకత్తా మామయ్యగారి యింటికి వెళ్ళాలన్నావు కదు టే "

" వెళ్లాలమ్మా "

" ఎప్పుడూ "

" ఇదిగో—ఎప్పటి కప్పుడే ఇలాగున జరిగిపోతూంది. రేపు దసరాకయినా వెళ్ళాలి "

" మాధవరావుగారు మామయ్య దగ్గరకు అస్తమానమూ వెడుతూ ఉంటాడుకాబోలు "

" అయ్యో! వాళ్ళిద్దరూ స్నేహితులుకాదూ? వస్తూ పోతూనే వుంటాడు అతని దగ్గరకి "

" అవ్వూళ్ళో ఆయనకు ఉద్యోగం కాబోలు "

" అలాగుననే చెప్పాడు. వీలయినప్పు డెప్పుడయినా రమ్మని మరీ—మరీ చెప్పాను. రానేలేదు. "

" రారేమో "

" ఏమో. అలాంటివాళ్ళకు తీరిక కలగొద్దుతల్లీ! ఉపాధి కోసం రెక్కల నమ్ముకొన్నప్పుడు, ఇష్టమొచ్చినట్లు తిరగడానికి వీలా మరి "

" నిన్ను నిజంగా చూడాలనివుంటే ఒక్కసారి అయినా రావడానికి తీరిక వుండదా యేం "

" ఏమోతల్లీ! ఆ మాటలు మనం అనడానికివల్లా. పోనీలే, ఇంక మనమే అక్కడకు వెళ్ళబోతున్నాముగా. వెళ్ళినప్పుడు అతన్ని కలుసుకొని, చూడకుండా వుంటామా యేం "

" నువ్వు పొరబాటుచేసావు. అప్పుడే మరి రెండురోజులు బలవంతపెట్టి అపుచెయ్యాలసింది "

" అయ్యో! ఎంతపట్టు పెట్టానో నువ్వెరుగవు తల్లీ! అప్పటికీ ఒక్కపూట ఉండడమే ఎంతో బ్రహ్మాండ మయిపోయింది "

" ఆయన వున్నంతసేపూ మన యిల్లు ఎంతో సందడిగా వుంది కదుటే అమ్మా "

" అవును తల్లీ! (తనలో) పాపం! చిన్నతనంలోనే భర్త పోవడంవల్ల, పురుషసౌఖ్యం ఎటువంటిదో ఎరుగదుకదా! ఒక వేళ మాధవరావు సుందరరూపాన్ని చూసి, భ్రమించిందేమో అయినా దీని కోరిక నిష్ఫలంకదా! అగ్నిహోత్రంలాంటి వంశంలో పుట్టి, ఇటువంటి కోరికలు దరికిరానియ్యడానికి వల్లా సుదర్శనానికి సంగతి యేమయినా తెలుస్తే తవ్విపాతేస్తాడుకాని యింకేమయినా వుందా! నా తల్లికి మనసు చలించకపోతే తరుచు మాధవరావు

ప్రస్తావనే తెస్తూ ఉంటుందెందుకు? ఏమయినా దీని కోరికలు గగనకుసుమాలై పోతున్నాయి. ఏం చెయ్యను. ఈ ప్రస్తావనా— ఈ ఆరాటమూ చూస్తే నా గుండె బ్రద్దలై పోతూంది. లోపల దిగమ్రింగాలి. అంతే "

" ఏమిటే అమ్మా! ఆలోచిస్తున్నావు "

" అబ్బే. ఏమీలేదు తల్లీ "

" చెప్పవుటె "

" చెప్పేటందు కేముందిలే. అతను పట్టుమని ఒక్క పూటయినా వుండకుండా వెళ్ళిపోయాడు. నా ప్రాణాలు రక్షించిన వానికి మనస్ఫూర్తిగా కృతజ్ఞత తెలుపడానికైనా అవకాశం లేక పోయింది. అదే ఆలోచిస్తున్నాను "

" మనమే కలకత్తా వెళతామని అన్నావుకదూ? అప్పు డతన్ని కలుసుకొని లక్షలూ—వేలూ కృతజ్ఞతలు తెలుపవచ్చును కదూ. నోటలకేం భాగ్యమే "

" మన మేదయినా యిస్తె పుచ్చుకుంటాడుటె వెర్రితల్లి "

అని ఆ తల్లీ కూతుళ్ళు (ఇందిర, సత్యవతమ్మ) ఇద్దరూ రామనగరంలో ఉన్న వాళ్ళ స్వంతగృహంలో మాట్లాడుకొంటూ ఉండగా, వీధిలో ఎవరో తలుపు తట్టినట్లయింది. అప్పుడు సత్య వతమ్మ " ఎవరో పిలుస్తున్నారల్లేవుంది చూచిరా తల్లీ " అని కూతురుతో అంటె, ఆమె, " నువ్వే చూసిరావే అమ్మా చేతిలో కుట్టుపనివుంది " అన్నది. అప్పుడు సత్యవతమ్మగారే వీధితలుపు తీసిజూసింది. అక్కడొక నూతన పురుషుడు నిలుచుని " ఓగిరాల సత్యవతమ్మగారి యిల్లు యిదేకదండీ " అని అడిగాడు. అప్పుడు సత్యవతమ్మ అతనెవరో, వచ్చినపని యేమో తెలియక " అవును

నాయనా యిదే ఆయిల్లు లోపలకు రా" అని ఆ నూతనపురుషుణ్ణి లోపలకు తీసికొనివెళ్ళి, ఒక కుర్చీలో గూర్చోబెట్టి, మంచినీళ్లు కావాలా ? అని అడిగి, అతను అక్కరలేదన్న మీదట "ఏవూరు నాయనా ? వచ్చిన పని యేమిటి" అని అడిగింది. అప్పుడా యువకుడు ఆమెతో యిలాగు నన్నాడు. లోపల పూలుకుట్లు కొంటూ వున్న ఇందిరకు వాళ్ళ మాటలు బాగా వినిపిస్తున్నాయి.

"మాది కలకత్తాలెండి. నన్ను అరవిందబాబు అంటారు. మాధవరావుకూ నాకూ ప్రాణస్నేహం. ఇద్దరమూ ఒకేచోట పని చేస్తున్నాము. నిన్నటి దినమున నేనూ, అతనూ, రమేశచందుగారి టీ తోట అజమాయిషీ చెయ్యడానికి వచ్చాము. మాధవరావు తొందర పనులలో మునిగ్యివుండడంచేత ఇక్కడకు రాలేక, మీ క్షేమం తెలుసుకొని రమ్మని నన్ను పంపించాడు. అతనికి ఏమయినా కబుర్లుంటె చెప్పండి నేను మళ్ళీ వెంటనే వెళ్ళిపోవాలి "

మాధవరావు దగ్గరనుంచి ఎవరో మనిషి వచ్చాడని విన గానే ఇందిర దారపుబంతిని—సూదిని అక్కడ వదలివేసి, ఒక్క పరుగులో తల్లిదగ్గరకు వచ్చి "ఎవరే అమ్మా వచ్చింది" అని ఆదుర్దాతో అడిగింది.

"మాధవరావు మన క్షేమ సమాచారాన్ని తెలుసుకొని రమ్మని యీాయనను పంపాడటమ్మా" అని ఆమె ఇందిరతో అన్నది. ఆ మాటల నంతకుముందే తన గదిలోనుంచి విన్న ఇందిర "ఉహూఁ ఆయన ఎందుకురాలేదే అమ్మా" అని తల్లి నడిగింది, "ఏవో తొందరపనులు ఉండడవల్ల రావడానికి వీలు లేకపోయిందట. అంతేనా అయ్యా" అని ఆ నూతనవ్యక్తివైపు జూచి అన్నది సత్యవతమ్మ. ఆమె మాటల కతడు ఇందిర ముఖం

వైపు తేరి పారి జూస్తూ "అప్పుడండి మరోసారి యెప్పుడయినా వీలుచేసుకొని వస్తానని చెప్పుతున్నాడు" అని సత్యవతమ్మకు సమాధానం చెప్పి, మళ్ళీ నాకు శలవిప్పించండి. వెళ్ళాలి—అతనికి ఏమయినా చెప్పవలసిన విషయాలుంటే చెప్పండి" అన్నాడు.

"అదేమిటి నాయనా వచ్చిందో అడుగూ, దానిదో అడుగూను. అప్పుడే వెడతాననడం యేం బాగుంటుంది? అప్పుడే సాయం కాలమయిందికదా, ఈ పూటకయినా అగు. ప్రొద్దుటనే లేచి వెళ్ళ వచ్చును" అన్నది సత్యవతమ్మ.

"అలాగున కాదండమ్మా చాలా పనివుంది వెళ్ళాలి. మరొ కప్పు డెప్పుడయినా వుండవచ్చును దానికేమి" అన్నాడతను.

అప్పుడు సత్యవతమ్మ అతను చెప్పేమాటలను వినిపించు కోక, ఒక్క పూటయినా వుండకుండా వెళ్ళడానికి వీల్లేదని మాధవరావు స్నేహితుణ్ని చాలా బలవంతంచేసి ఆపుజేసింది. అతనుకూడా మరీ మొండితనంచేసి వెళ్ళిపోతే మరి బాగుండదని గాబోలు—ఆ పూటకు ప్రయాణము నాపుజేసి వారి ఆతిథ్యాన్ని ఎంతో కష్టంమీద అంగీకరించాడు.

సత్యవతమ్మకు మాధవుని స్నేహితుడైన ఆ యువకుని యందుగూడా, మాధవునియం దున్నటువంటి గౌరవభావమే కలిగింది. ఆనాడు పెందళకడనే మడి గట్టుకొని, రెండుమూడు పిండివంటలతోను, రుచ్యములయిన వేపుడు కూరలతోను, అర విందబాబుకు విందుజేసి, అనంతరము కుమార్తెతో భోజనముజేసి. క్రొత్తగావచ్చిన అతిధికా రాత్రి ఒక విశాలమయిన గదిలో పక్క నేర్పాటుజేసి, అతని నందు పరుండమని జెప్పి, కొంతసేపతనితో దమ స్థితిగతుల గురించియు, దన సోదరుడయిన సుదర్శనుని

గురించియు చెప్పాడు. మాధవుడు తనకుచేసిన మహోపకారమును గూడ చెప్పి, పిమ్మట అంతకుముందే వేరొక గదిలో పరుండి నిద్రించుచున్న తన కుమార్తెయగు ఇందిర ప్రక్కలో పడుకొని సత్యవతమ్మ గూడ కొంతసేపటికి నిదురపోయెను.

వీధివైపుగదిలో పరున్న అరవిందబాబున కెంతప్రయత్నించినా నిద్దుర పట్టడంలేదు. అతడు నిదురించడానికి ఎంతగా ప్రయత్నించినట్లుగా కూడా తోచదు. కన్నులు విప్పుకొని గృహాము నంతను పరిశీలించి చూస్తున్నాడు, అతని బుర్రలో అనేకములయిన వింత కోరికలు పరుగులెత్తడం మొదలుపెట్టాయి

అరవిందబాబు పడుకొన్నది వీధివైపుగది. ఆగదికిని సత్యవతమ్మా, కూతురూ పడుకొని ఉన్న గదికీ మధ్యగా ఒక పెద్ద మండువా వుంది. మండువాకు రెండుప్రక్కలా మరోరెండు పెద్దగదు లున్నాయి ఆ రెండు గదుల్లోను ఒకటి ఎప్పుడు తాళం వేసే వుంటుంది. దానిలో వెండిబంగారు సామానులు, విలువైన బట్టలూ ఉంటాయి రెండోది వంట యిల్లు. వీధివైపు గదిలో నుంచి మండువాలోకి వెళ్ళే ద్వారం ఎప్పుడూ తీసే వుంటుంది. సత్యవతమ్మ ఇందిర పడుకొన్న గదిలోకి మండువా వున్న వసారాలోనుంచే వెళ్ళాలి. ఆ గది తలుపును ఒకొక్కప్పుడు తీసికొంటారు—ఒక్కొక్కప్పుడు వేసికొనే పరుంటారు. ఆ గదిలో నాలుగైదు పెద్దట్రంకులు—ఒక పెద్ద పందిరి మంచము—యింకా కొన్ని చిల్లర సామానులూ వున్నాయి. ఆ మంచంమీదనే యిపుడు తల్లీ కూతుళ్ళిద్దరూ గాఢనిద్రా పరవశులై యున్నారు. ఆ గదికి వెనుకతట్టు మరిరెండు మూడుగదులూ—ఓ పెద్దవసారా వున్నాయి. దానికి వెనకాల విశాలమయిన దొడ్డి—ఆ దొడ్డిలో

నుయ్యి, కొన్ని కొబ్బరిచెట్లు—ఇంకొన్ని పూలచెట్లూ వున్నాయి. ఇది—సత్యవతమ్మగారి గృహనిర్మాణ వృత్తాంతము. అప్పుడు సత్యవతమ్మగారు పడుకున్న గది తలుపులు ఓరవాకిలిగా వెయ్యబడిఉన్నాయి. దీపం కొద్దిగా తగ్గించబడి వుంది.

అప్పుడు నిద్రపోకుండా వున్న అరవిందబాబు ఇలా తన ఆలోచించుకోవడం మొదలుపెట్టాడు—

"ఇంతవరకూ నా పాచిక బాగా పారిందన్న మాటే. ఇక ముందు కర్తవ్యం ఎలాగున ఉంటుందో చూచుకోవాలి ఆ: చూచే టందు కేముంది? ఇంతవరకూ వచ్చాక, పనిసాధించక మానుతానా? ఇప్పుడు నేనిక్కడకు వచ్చిన పనులు రెండు. ఒకటి కాంత—రెండోది కనకం. రెంటిలోనూ ఒకటయినా కొనసాగకపోతుందీ? అప్పుడే గడియారం ఒకటి కొట్టి అరగంటకు పైగా దాటింది. టీ తోట కూలీలు గుమ్మంలో యీపాటికి చేరి కాచుకొనే వుంటారు. త్వరపడాలి—ఆ వచ్చు మాధవరావు వల్ల యేమవుతుంది? నాకు రెండువందలమంది కూలీల బలంవుంది. వాడికేముంది? కాదంటే ఆ అరవిందబాబు ఒక్కడున్నాడు. వాడో దద్దమ్మ. చూస్తూ చూస్తూ మూడువేలరూపాయల రొక్కం నాకు దర్శించి వూరుకొన్నాడు. వచ్చినట్లు మాధవరావు మళ్ళీ కలకత్తానుంచి పంపేవరకూ దిక్కులేకపోయింది. ఆ ఎరకయ్య ఆనాడు పాలవాడివేషం వేసి మా బాగా టోపీ వేసాడు. తరువాత ఆ తెలివితక్కువ పెద్దమ్మ బల్లమీదవున్న తాళాలగుత్తును మరచిపోయినవే అనుకున్నాడు. కాని దొంగతాళాలు అనుకోలేదు. తరువాత ఆయన దగ్గరవున్న రెండో తాళంగుత్తినయినా జూచుకోలేదు కాబోలు. ఆ నాటి రాత్రి టీ తోటదగ్గర ఆ మాధవరావుగాడు అడ్డుపడకపోతే నాపని యెలా

గుండేది ? వానివ్యాపార పట్టుదల యెక్కడికి పోతుంది ? ఈసత్య పత్రము అప్పుడు గాకపోతే యిప్పుడు దోచుకోక మాన్తానా ? ఈ వెఱ్ఱిపీనుగులు గూడా నేను మాధవరావు స్నేహితుడయిన అరవిందబాబునే అనుకొని, ఎంతస్వేచ్ఛగా నిద్దురబోతున్నారో ! ఆ నాడు మాధవరావు యీ సత్యపత్రము అడ్డుపడి—రక్షించి, తానే స్వహస్తంగా యీ గ్రాహం తీసుకొని రాబట్టె, నేను వాళ్ళ ఇంటివెనకాలె రహస్యంగా రావడం—ఈ యిల్లు గుర్తించడం—అందాల దొంతర అయిన యీ ఇందిరను జూడడం—ఈమె మీద కన్నువేయడం జరిగింది. లేకపోతే యివన్నీ ఎలా జరుగుతాయి ? ఏదివచ్చినా మన మేలుకే అనుకోవాలంటారు ఇందుకే. ఇందిర కిప్పుడు ఒంటినిండా వొంటెడు నగలున్నాయి. వాటితో ఆమె నాకు దక్కితే ప్రస్తుతం యింకేమీ అక్కరలేదు. ఆ తల్లిముండ కూడా ఆమె పక్కలోనే చచ్చింది. వ్యవహారం చాలా జాగ్రత్తగా చెయ్యాలి: లేకపోతే ప్రమాదం వస్తుంది........" అతను ఆలోచించుకొంటూ వుండగా గడియారం రెండు కొట్టింది. ఆగంటలను వినగానే ఆ వ్యక్తి ఉలికిపడి ప్రక్కమీదనుంచి లేచి, మెల్లగా వీధితలుపు దగ్గరకు పోయి, చప్పుడు కాకుండ గడియతీసి, అటూ యిటూ జూసాడు. అక్కడ ఎవరో పదిమంది నెత్తిని గుడ్డలు చుట్టుకొని ఆ అరుగుమీదనే పడుకొని వున్నారు. అతను వాళ్ళతో యేమేమో గుసగుసలాడి ఇద్దరినిమాత్రం తనతో మళ్ళీ లోపల ప్రవేశించి, చప్పుడు కాకుండా మునికాళ్ళమీదనే నడుస్తూ మండువాను దాటి ఇందిర, తల్లీ పడుకొన్న గదిలో ప్రవేశించి జూసేటప్పటికి, ఆ తల్లీ గూతుళ్ళిద్దరూ పడుకొన్న మంచందగ్గర ఒక నల్లటి వ్యక్తి పెద్దగ్రుడ్లతో భయంకరంగా జూస్తూ, ఆ గదిలో

ప్రవేశించిన వారిపైపు పిస్తోలు నెత్తి జూపుతున్నాడు. ఆ భీకరా కారుని జూనేటప్పటికే ఆ దుర్మార్గులకు మీది ప్రాణాలు మీదుగానే యెగిరిపోయాయి. వాళ్ళయిక ప్రాణాలు దక్కించుకోవడం ఎలాగా అని ఆలోచిస్తూ ఆ పిస్తోలును పట్టుకొని భయంకరంగా జూస్తూన్న మనిషిపైపే వాళ్ళు జూస్తూ మెల్లగా ఒకొక్కడు కాలు వెనుకకు వెయ్యడం మొదలుపెట్టారు. ముగ్గురూ ఆ గదిగుమ్మం దాటగానే అందులో ఒక తెలివైనవాడు ధయిర్యంచేసి. ఆ గది తలుపును తటాలున బయట గొళ్ళెం పెట్టాడు. అప్పుడు మిగతావాళ్ళదరకూ మళ్ళీ యెగిరిపోయిన ప్రాణాలు చేరుకొన్నాయి. ఊరికే పోవడానికి యిష్టపడని వాళ్లు త్వరగా ముందువాకు చేరివున్న గదితలుపు యొక్క తాళాన్ని బ్రద్దలుగొట్టి, లోపల ప్రవేశించి, పిస్తోలు పట్టుకొన్న మనిషి తలుపులు బ్రద్దలుచేసుకొని ఎక్కడ మీద పడిపోతాడో అని తొందర తొందరగా ఆ గదిలో తమకు అంకిన కొన్ని వెండి సామానులను—విలువయిన బట్టలను అంకించుకొని ఎలాగో బయటపడి, పుంతకు చేలకు అడ్డుపడి, తమ మిగతా స్నేహితులతో పారిపోయారు.

అలవాటు ప్రకారం సత్యవతమ్మ కోడికూత వినగానే నిద్రనుంచి మేలుకొంది. ఇందిర మాత్రం యింకా లేవలేదు. లేచిన సత్యవతమ్మ బయటకు వద్దామని గదిద్వారం దగ్గరకు వచ్చేటప్పటికి, తలుపు బయట గొళ్లెంవేసివుంది. రాత్రి తాము తీసేవుంచిన తలుపు వేసివుందేమా అని ఆమె దానిని రెండు సార్లు లాగి చూసింది. కాని అది రాలేదు. ఒకవేళ అరవిందబాబు తమ క్షేమానికై బయట గొళ్లెంపెట్టి పడుకొన్నాడేమో అనుకొని "అరవిందబాబూ! అరవిందబాబూ! లేచాను తలుపుతియ్యి

నాయనా " అని రెండుమూడు సార్లు పిలిచింది. జవాబు రాలేదు. అప్పుడామె గుండెల్లో కొంచం అదటుబయలు దేరింది. వెంటనే ఇందిరను లేపి, ఇంకేమయినా చెబుతే కంగారుపడుతుందేమో అని, " అమ్మా ! బయటకు పోవాలి, చీకటిఇంకా పోలేదు. కొస్త లాంతరు పట్టుకుసిరా అమ్మా " అని చెప్పగానే ఇందిర కళ్లు నులుపుకొంటూ లాంతరు చేత్తోపట్టుకొని తల్లివెనకాల యేమీ ఆలోచించకుండా బయలుదేరింది. సత్యవతమ్మ మెల్లగా ఆ గదికి దొడ్డివైపునున్న గడియ తీసి, దొడ్డిలో ప్రవేశించి, ఆ మార్గం గుండా అక్కడకో నలభయిగజాల దూరంలో ఉన్న పొరుగింటికి వెళ్ళి, అప్పటికప్పుడే స్నానంజేసి, జపం చేసుకుంటూన్న శాస్త్రి గారిని పిలువగానే, ఆయన జపంమాని, సత్యవతమ్మ దగ్గరకు వచ్చి, " ఏమండమ్మా యిలాగొచ్చారు ? ఏమికావాలి " అని అడిగాడు.

" అమ్మా ! బయటకు వెళ్ళాలని పీళ్ళింటికి తీసుకొచ్చా వెందుకే " అని ఇందిర అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పకుండా సత్యవతమ్మ శాస్త్రిగారితో " అన్నయ్యగారూ ! మేముపడుకొన్న గదికి అవతల ఎవరో గొళ్ళెం పెట్టారండీ కొంచెం భయంగా వుంది. ఒక్కమాటు మాతో వస్తురూ అలాగున తిరిగి వెళ్ళి చూతాము " అంది.

" అయ్యో అలాగునమ్మా ! విన్న మీ యింటికొచ్చిన చుట్టం వెళ్ళిపోయాడా " అని ఆత నడిగాడు. " లేదు నాయనా ! ఎంతపిలచినా ఆతగాడు పలకడంలేదు. నిద్దరలో వున్నాడో యేమో. ఒక్కసారి వస్తారా " అంది.

వెంటనే శాస్త్రి తన యిద్దరి పోలీకాపులను నిద్దరనుంచి లేపి, తాను ఒక లాంతరును చేత్తోపట్టుకొని, తన యింటిలోనుంచి, వీధిలోకి వచ్చి, సత్యవతమ్మగారి వీధిగుమ్మం దగ్గరకు వచ్చి చూసేసరికి తలుపులన్నీ బారుపెట్టి వున్నాయి. వాటిని జూడగానే సత్యవతమ్మ "అమ్మయ్యో ! కొంప మునిగింది" అని ఒక పెద్ద వెర్రికేక వేసేసరికి చుట్టుప్రక్క ఉన్నవాళ్లు నలుగురూ మూగారు. అప్పుడందరూకలసి సత్యవతమ్మగారి ఇల్లు ప్రవేశించి చూసే టప్పటికి యింకేముంది. అరవిందబాబూ లేడు—అద్దానంబాబూ లేడు—నిజంగానే కొంపమునిగింది. తాళంవేసికొన్న తలుపులు బ్రద్దలుకొట్టబడి వున్నాయి. సత్యవతమ్మ పెద్దపెట్టున ఏడుస్తూ నాలుగువైపులా వెదుకుకోవడం మొదలుపెట్టింది. తల్లిఏడుస్తుంటే ఇందిరకూడా విక్కమొగం వేసింది. నలుగురు పెద్దమనుష్యులూ వాళ్ళ నోదారుస్తూ, "అమ్మా ! ఏదో ఘోరం జరిగింది. ఏమున్నాయో యేమిలేవో ముందు జూసుకోండి ఆ దొంగముండాకొడు కెవరో అరవిందబాబు పేరుతో మీ యింట్లో ప్రవేశించి, సర్వనాశనమూ చేసాడు. ఇంకా నయమే—మీ ప్రాణాలకు మాత్రం మొప్పం రాలేదు. ఒంటినిండా బందెడు నగలూ—పిల్లా క్షేమంగాఉన్నారు" అన్నారు.

అప్పుడు సత్యవతమ్మ కొంతవరకు కుదుటపడి "ఇనప్పెట్టి చెక్కుచెదరలేదర్రా ! మిగతా పెట్టెలలో వున్న బంగారు సామానులు గూడా యేమీ కదలలేదు. చిల్లరగా పడేసినవి కొన్ని వెండి సామానులు—కొన్నిబంగారువస్తువులు—కొన్ని బట్టలూ మాత్రమే పోయాయి. ఇంతవరకు అదృష్టవంతులమే" అంటూ రాత్రితాము పడుకొన్న తలుపు గొళ్లెంతీసి అందరూ ఆ లోపల ప్రవేశించారు.

అక్కడ పిస్తోలుపట్టుకొని భయంకరంగా నిలుచున్న బొమ్మను జూసి శాస్త్రిగూడా మొదట కొంచం జంకి తరువాత మళ్ళీ సర్దుకొని,

" ఏమండోయి సత్యవతమ్మగారూ! మీ పెద్దలు చేయించి పెట్టిన యీ యినపబొమ్మే మీ ప్రాణాలను రక్షించిందనుకొండి. ఇంతకుముందు రెండుమూడు సారులు జూసిన నాకు గూడా మొదట భయం కలిగింది. అదొంగ యెవరో మొదట ఇందిరను_ ఆమె నగలను అపహరిద్దామని మీ యింట్లో ప్రవేశించాడు. రాత్రి ఈ విగ్రహాన్ని జూసి ఇది నిజమయిన మనిషే అనుకొని, వెనుకకు జంకి, గదికి బయట గొళ్ళెంపెట్టి ఈ పిస్తోలుమనిషి భయం లేకుండా చేసుకొని, తరవాత ఆ గదితాళం బ్రద్దలుకొట్టి అక్కడి చిల్లరిసామానుకు కక్కుర్తిపడి వుంటాడు, ఇది వాస్తవవిషయం. ఆ అరవిందబాబు అసలు ఎవరండీ! మీబంధువేనా" అని అడిగాడు.

" కాదు నాయనా! మా పరిచితుడు అప్పుడు అనుకొంటూ వున్న మాధవరావు స్నేహితుణ్ని అని చెప్పి వచ్చాడు. ఇంత మోసం ఉంటుందని నాకేమి తెలుసుమతండ్రీ! కొంపముంచాడు. నా గుండెలు బేజారయిపోయినాయి. ఇంక ఒక్క క్షణమయినా ఈ యింట్లో వుండలేను. శాస్త్రిగారూ! మమ్మల్ని ఎలాగయినా ప్రయాణం చేయించి, మా సామానులతో, కలకత్తాలో వున్న మా తమ్ముడు సుదర్శనందగ్గర చేరిస్తిహా మీకు పుణ్యం వుంటుంది " అని ప్రాధేయ పూర్వకంగా వేడుకొంది, అందుకు శాస్త్రికూడా సమ్మతించి, పదిమంది కూలీలను పిలచి, సామానంతా సర్దించి, బళ్ళమీద వేయించి, సత్యవతమ్మగారి జహ్వేరీ—ఇనుపపెట్టె— మిగిలిన సర్వసామానులూ బళ్ళపై వేయించి, ఇంటికి తాళాలు

వేయించి మరో పడిమంది స్నేహితుల సాయంతో, ఆ పగటి పూటనే ప్రయాణం చేయించి, సత్యవతమ్మను—ఇందిరను కలకత్తా సురక్షితంగా చేర్చాడు. వాళ్ళక్కడకు చేరేవరకూ ప్రాణాలు కుదుట పడనేలేదు పాపం. తరువాత శాస్త్రి వాళ్ళదగ్గర శలవుపుచ్చుకొని మళ్ళీ రామనగరం చేరుకొన్నాడు.

.... .... .... ....

సుదర్శనం మొదట్లో అప్పగారయిన సత్యవతమ్మ పూచిక పుల్ల సహితంగా సామానంతా తర్లించుకొని రామనగరం—స్వంత యిల్లూ వాకిలీ—వదలేసి వచ్చినందుకు ఆశ్చర్యపోయాడు. కాని క్రమంగా జరిగిన వృత్తాంతమంతా ఆమెవల్ల వివరంగా విన్న మీదట ఆమెకు వచ్చిన చిక్కులకు చాలా విచారించాడు. ఎవరో దుర్మార్గులు ఆమెమీదనే కక్ష కట్టినట్లు ఒకసారి తరువాత ఆమెనే ముట్టడించడం—రెండుసార్లూ గూడా దైవానుగ్రహంవల్ల నామె రక్షింపబడడం చూసి, ఆమెకు పూర్తిగా చెడుగురోజులు కావని నిర్ధారణ చేసికొన్నాడు. ఏమయినా ఒంటరిగా ఆ కుగ్రామంలో పడి వుండడం కంటె, సత్యవతమ్మ—పిల్ల తన దగ్గరనే కొన్నాళ్ళ పాటు వుంచుకోవడం మంచిదనుకుని, ఆమెతో కూడా ఆ విషయమే చెప్పి, ఇక ఆమె కెటువంటి భయమూ వుండదని వోదార్చాడు. బెంబేలెత్తి హడలిపోతూవున్న సత్యవతమ్మ తమ్ముడియొక్క ధైర్య వచనాలవల్ల కొంతవరకూ కుదుటబడి—అతని యింట్లోనే, దన యావదాస్తితోనూ తల దాచుకొంటూంది. అవసరం కలిగినప్పు డల్లా తానే స్వయంగా రామనగరం వెళ్ళి రయితుల దగ్గరనుంచి పిస్తులు వగైరాలు వసూలుచేస్తూ—సత్యవతమ్మగారి వ్యవహారాల

పనిన్నింటినీ చూసిపెడతానని వాగ్దానంచేసి, అక్కకు, మేనగోడలకు గూడా ఏ విధమయిన లోటూ లేకుండా కనిపెడుతున్నాడు. డబ్బు వున్నదని అవుతేనేమి—సోదరి అని స్వతసిద్ధమయిన ప్రేమ వుండడంవల్ల అవుతేనేమి.

## 6

ఈ సమాచారము నంతనూ వినిన రమేశచందు చాలా విచారించాడు. తన టీ తోటను గురించీ, తనక్రింద పనిచేసే మనుష్యులను గురించీ—యిటువంటి చెడ్డపేరు వస్తూన్నందుకు మరీమరీ ఖేదపడ్డాడు. అంతకుముందు ఆఫీసులో పోయిన మూడువేల రూపాయలకు ఎవరినీ ఏమీ అనలేక కిక్కురుమనకుండా మర్నాడు మళ్ళీ పంపించి, బట్వాడా చేయించాడు. ఇప్పుడు లోకులకు కూడా చాలా బాధకలుగుతూంది కొందరి దుర్మార్గుల మూలాన. ఈ దౌర్జన్యాలన్నీ తన టీ తోటలో పనిజేసే వాళ్ళవల్లగాక, మిగిలిన వారివల్ల జరగడంలేదని అతను నమ్మాడు. ఇప్పుడు తన కూలీల గురించీ—తన వుద్యోగస్థుల గురించీ పోలీసువారు కూడా నిగా వేసి వుంచారు. ఎంత అప్రతిష్ఠ! రెండుమూడు లక్షల వ్యాపారం జేసే ఆసామీకి ఇటువంటి మచ్చ వచ్చిందంటే ఎంతకష్టంగా నయినా వుంటుంది. ఎవరిని అనుమానించడానికీ వీలుపడకుండా వుంది—ఎవరిమీద నిందమోపడానికీ వలనుపడదు. ఎవరిమట్టుకు వారే పెద్దమనుష్యులు—మాధవరావుయొక్క నమ్మకం—యోగ్యత ఆతను సంవత్సరాలనుంచీ ఎరిగివున్నదే కదా! అరవిందబాబులో వేలుపెట్టి చూపించవలసిన తప్పు ఇన్నాళ్ళనుంచీ ఒక్కటీగూడా కనబడదయ్యెను. ఇక గోపీచందు ఏ అనవసరపు వ్యవహారం

లోనూ కలగజేసుకొనే కలగజేసుకోడుకదా! అత నవసరం ఉన్నప్పుడే గాని ఎవరితోనూ మాట్లాడడు. తన పనేమో—తన గోలయేమో అంతే. ఇంక అయిదారు వందలమంది కూలీలలో ఎవరిని అడగడం? ఏమని అడగడం. ఇదంతాజూస్తే రమేశ చందుకు పచ్చి వెలగకాయ గొంతుకలో పడినట్లుంది.

అతనేమీ తోచకుండా ఈ విషయాల నన్నిటిని ఆలోచించుకొంటూ ఒకనాటి మధ్యాహ్నం ఆఫీసుగదిలో కూర్చొని వుండగా, పోష్టుజవాను వచ్చి, ఒక వుత్తరాన్ని ఆయనముందు పడేసి వెళ్ళిపోయాడు. రమేశచందు దానిని విప్పి ఈ విధంగా చదవడం మొదలుపెట్టాడు. కంపించె హృదయంతో—

"శ్రీ రమేశచందుగారికి,

తమ ఉద్యోగస్తులలో ఒకడు వ్రాసుకొనే విన్నపం-మాధవ రావుపై నేను కక్షకట్టాను. ఎందుకంటే. నేనొకనాడు టీ తోట ప్రాంతంలో ఒక వితంతువును దోచుకోబోతుంటె అతను నా కడ్డుపడి నాకార్యాన్ని భంగంజేసాడు. ఆ పట్టుదల సాగించడానికే తరువాత సత్యవతమ్మగారి యింట్లో అరవిందబాబు పేరుతో ప్రవేశించి, నేను మనసారా ప్రేమించిన యిందిరను సర్వాభరణాలతోనూ అపహరించడానికి ప్రయత్నించాను. దైవం నాకు ప్రతికూలం అవడంవల్ల అప్పటికి నా ప్రయత్నం కొనసాగింది కాదు. ఎప్పటికయినా నా పంతం నెగ్గించుకు తీరతాను, ఈ వ్యవహారంలో నా కడ్డువచ్చిన వారి ప్రాణాలు దక్కడం వట్టిది. నాకు అయిదు వందల మంది పరివారం వున్నారు. గతరాత్రి నా అవసరం నిమిత్తం మీ ఇనపపెట్టెలోనుంచి అయిదువేల రూపాయలను తీసికొన్నాను. మీరింకా చూసుకొనివుండరు. అందులో అసలు

పదివేల నోట్లు మాత్రమే వున్నాయి. మిగతా అయిదువేలను మీ ఖర్చునిమిత్తం వదిలేశాను. అవసరం కలిగినప్పుడు మళ్ళీ తీసుకోనడానికి ఏమీ అభ్యంతరం వుండదని. నా వింత చర్యలు మీకు అర్థంకాకపోవచ్చు. అర్థం చేసుకోవడానికి ప్రయత్నించి, అనవసరంగా శ్రమపడకండి.

ఇట్లు
సేవకుడు "

ఈ ఉత్తరమునంతను సాంతముగా చదివిన రమేశచంద్రు విభ్రాంతపోయాడు. వెంటనే వణుకుతున్న కాళ్ళతో యినపపెట్టె తెరచి అందులోవున్న నోట్లను లెక్కపెట్టుకొనేసరికి సరిగా అయిదువేలూ తక్కువగా వున్నాయి—దానితో అతనికి ఆశ్చర్యము భయము వృద్ధిఅయినాయి. అతనికేమీ తోచిందికాదు. మనిషి విలువెత్తునా కూలబడిపోయి " ఇదేదో సర్వనాశనానికి వచ్చింది. నా చేతిక్రింద పనిచేస్తున్న వారిలో ఇల్లాంటి ఘోరపాపు లున్నారని యెప్పుడూ అనుకోలేదు. ఇప్పుడు తెలిసిమాత్రం ఏమిచెయ్యాలి. అయిదువందలకు పైగా కూలీలున్నారు. యిరవై మందికి పైగా గుమాస్తా లున్నారు. ఒక్కడు అపరాధం చేసాడని అంతమందినీ ఎలాగున శిక్షించడం " అని ఆలోచిస్తూవుండగా మాధవరావూ, గోపీచందూ ఆఫీసుగదిలో ప్రవేశించి నిర్విణ్ణుడై విచారిస్తూ వున్న రమేశచందును చూసి, తెల్లబోయారు. రమేశచందు వాళ్లను చూడగానే కొంత లేని ధయిర్యం తెచ్చుకొని వాళ్ళకు సంగతంతా చెప్పి, తనకా దొంగవ్రాసిన వుత్తరం చూపాడు.

మాధవరావు దాన్ని చదువుతూంటే గోపీచందు తెల్లబోయి—"ఎంత సాహసం—తిన్నయింటి వాసాలనే లెక్కపెట్టె యీ దుర్మార్గు డెవడై యుంటాడు "అన్నాడు.

"ఇదంతా మహా మాయగావుంది. చివరకు వాడెవ్వడో మనల నందరను పట్టి వెర్రిదద్దమ్మలక్రింద చేసాడు. నా మీద వీడికి కక్షట! కానియ్యండి ఆ కక్ష ఏమిటో నేనూ చూడవలసిందే. రమేశచంద్రుగారూ! మీరు వెంటనే ఒక రిపోర్టువ్రాసి యివ్వండి. వెంటనే పోలీసుస్టేషనులో దాఖలుచేయిద్దాము" అన్నాడు. "సరె. ప్రస్తుతం అంతకంటె చేయదగ్గా పనికూడా లేదులెండి" అని రమేశచంద్రు ఒక రిపోర్టును వ్రాసి, గోపీచంద్రు చేతికిచ్చి, పోలీసు స్టేషనులో యిచ్చిరమ్మని పంపాడు, అతను వెళ్ళాక "తోటనుంచి ఈయన ఎప్పుడు వచ్చాడు" అని రమేశచంద్రు మాధవరావు నడిగాడు.

"విన్నటి సాయంకాలమే వచ్చారు. ఈ వారం నేను బట్వాడాకు తోటకు వెళ్ళకపోవడంవల్ల అతనే బట్వాడా అర్డరు వేయించుకొందామనీ—సొమ్ము తీసుకొని వెడదామనీ వచ్చాడుట. విన్న సాయంకాలం మనం బ్రాంచికి వెళ్ళడంచేత అతను మనల్ని కలుసుకోలేక పోయాడుట. ఈ ప్రొద్దుటనుంచీ నాబసలో ఉన్నాడు" అని మాధవరావు అన్నాడు.

"అలాగునా?" అని రమేశచంద్రు ఊరుకున్నాడు. ఇంతలో గోపీచంద్రు నలుగురు పోలీసులను—ఒక ఇనస్పెక్టరును వెంట బెట్టుకొని ఆఫీసులో ప్రవేశించాడు. ఇనస్పెక్టరు రమేశచంద్రును చూడ్డంతోనే నమస్కరించి, "ఏమండోయి పెద్దపట్టె పట్టాడు అతనెవ్వరో. చాలా తెలివయిన వాడికిమల్లేనే వున్నాడు. సామాన్యపురకం కాదు" అన్నాడు. అప్పుడు రమేశచంద్రు "పైగా ఉత్తరం గూడా రాసాడు దర్జాగా. జూసారూ" అంటూ

తనకప్పుడు వచ్చిన ఉత్తరాన్ని రమేశచందు చేతికందివ్వగా అతను దాన్ని సాంతముగా చదివి—

"ఇప్పుడు మీ ఆఫీసులో పనిజేసే గుమాస్తాలెందరు" అని అడిగాడు.

రమే : ఈ ఆఫీసులో పనిజేసేవాళ్లు పదిహేనుగురు— బ్రాంచిలో అయిదుగురు. తోటదగ్గర ముగ్గురు.

ఇన : మొత్తం ఇరవై ముగ్గురన్నమాట. ఈ వేళ ఆదివారం కావటంచేత ఆఫీసుకు శలవనుకుంటా.

రమే : అవునండి.

ఇన : రేపుదయమేవచ్చి, మీ యిరవైముగ్గుర గుమాస్తాలనూ అరష్టుచేస్తాను. మీ రేమంటారు ?

రమే : అది న్యాయమంటారా ?

ఇన : అలాగున జేస్తేనేగాని నిజం తేలదు.

రమే : ఒక్కణ్ణి గురించి, నిర్దోషులెందరో బాధపడవలసి వస్తుంది. పైగా అందులో నా ప్రాణసమానుడయిన యీ మాధవరావు, అతని క్రింద పనిజేసే యిద్దరు నమ్మకస్తులయిన గుమాస్తాలు చిక్కుకుంటారు, అది నేను సహించలేను. వాళ్ళు నా దగ్గర చాలా కాలంనుంచి పనిజేస్తున్నారు. వాళ్ళ ప్రవర్తన అనుమానించ దగ్గదికాదు.

ఇన : పోనీ ఆ ముగ్గురను తప్పించి, మిగతా వాళ్ళను బంధిద్దాము.

రమే : కారణ ముండొద్దా అండి ?

ఇన : అనుమానమే కారణం. మాకు అరష్టు చెయ్యడానికి కారణం అవసరంలేదు.

రమే : అదిగూడా నాకు మనస్కరించడం లేదండి.

ఇన : అయితే మీ యిష్టం. నిన్నరాత్రి ఇక్కడ ఎవరు పడుకొన్నారు ?

రమే : ఇద్దరు నౌఖరులు పడుకొన్నారు ?

ఇన : వాళ్ళను పిలిపించండి.

మాధవరావువెళ్ళి వీధిఅరుగుమీద చుట్టపీలుస్తూ గూర్చున్న ఇద్దర జవానులను తీసుకొచ్చి, ఇనస్పెక్టరుముందు నిలుపుతాడు.

ఇన : రాత్రి కాపలా పడుకొన్నది మీ రిద్దరేకదూ ?

ఇద్దరూ : చిత్తమండి.

ఇన : మీ రిక్కడ పడుకొనివుండగా పైవాళ్లెవరయినా ఇక్కడకు వచ్చారా ?

ఒకడు : గోపీచందు బాబయ్యగారు మాత్రం వచ్చారండి.

ఇన : వచ్చి యేమన్నారు ?

రెండ : మాధవరావుగారు వున్నారా ? అని అడిగారండి.

ఇన : అప్పుడు వారిచేతిలో యేమున్నాయి ?

ఒక : ఏదో తెల్లగా దంతలా తళతళ లాడిందండి.

ఇన : మాధవరావుగారు లేరంటే ఏమిచేసారాయన ?

ఒక : వారింటికి పోతానని వెళ్ళారండి.

ఇన : ఈసంభాషణంతా మీకు ఆఫీసులోపలనే జరిగిందా?

ఒక : చిత్తం !

ఇన : ఆయన వెళ్ళిపోయాక మీరింకా ఎంతసేపటివరకూ మేలుకొని వున్నారు ?

రెండ : వెంటనే తలుపులేసి పడుకొన్నామండి.

ఇన : (గోపీచందువైపు చూసి) గోపీచందుగారూ! వీళ్ళు చెప్పినదంతా నిజమేనా? మీరు రాత్రి యిక్కడకు వచ్చారా? ఎందుకొచ్చారు?

గోపీ : వీళ్ళు చెప్పినదంతా నిజమేనండి. రాత్రి ఎనిమిదవుతుంది. నే నిక్కడకు మాధవరావుకోసం వచ్చి—

ఇన : అప్పుడు మాధవరావుగారితో మీకు ఏమయినా పనివుందా?

గోపీ : వున్నదండి.

ఇన : వారు లేరని తెలియగానే ఏమిచేసారు?

గోపీ : అతని బసకు వెళ్ళాను.

ఇన : (మాధవరా వైపుజూసి) మాధవరావుగారూ!గోపీచందుగారు మీ బసకు ఎన్నిగంటలకు వచ్చారు?

మాధ : పదవుతుందండి.

గోపీ : ఆఫీసునుంచి బయలుదేరి హోటలుకు పోయి భోజనం చేసి వెళ్ళేటప్పటికి అంత టైము అయి వుండవచ్చును.

ఇన : ఆ విషయం నే నడగలేదు కదండీ! రమేశచందుగారూ నాకు శలవిప్పించండి. మీ డబ్బుమాత్రం దొరకడం కష్టం. దొంగ దొరకవచ్చు' అని చెప్పి యినస్పెక్టరు తన సిబ్బందితో వెళ్ళిపోయాడు.

ఇనస్పెక్టరు వెళ్ళినతరువాత రమేశచందు, మాధవరావూ, గోపీచందు, మరికొంత సేపు ఏమేమో మాటాడిన అనంతరం మాధవరావు గోపీచందు తెచ్చిన టీ తోటకు సంబంధించిన లెక్కలను తనిఖీచేసాడు. రమేశచందు గోపీచందుకు బట్వాడా నిమిత్తమై కొంతపైకము విచ్చాడు. ఆ పైకమును పుచ్చుకొని అతడు

మాధవరావుదగ్గర, రమేశచంద్రు దగ్గర శలవు పుచ్చుకొని తోట లోని ఆఫీసుదగ్గరకు వెళ్ళాడు. అతను వెళ్ళినతరువాత రమేశ చంద్రు—మాధవరావు యీ క్రింది విధంగా మాట్లాడారు.

రమే : మాధవరావుగారూ! మన పరిస్థితులు ఏమీ బాగు లేవు. ఒకవైపున అప్రతిష్ట—మరోవైపున విశేష ధననష్టం. దేనికై విచారించడం ?

మాధ : రెండూ ముఖ్యమైనవే. యినపపెట్లకు తాళంతాళం లాగే వుంటూంది. లోపలి సొమ్ము మాత్రం మాయమవుతూంది. క్రిందటిసారి నా ఆఫీసులోని యినపపెట్టెను బాగా పరీక్షించి చూసాను దొంగ ఆ పెట్టెను ఎలాతెరిచాడా అని—

రమే : ఎలాగున తెరిచాడంటారు ?

మాధ : పెట్టెకు వెనుకతట్టున ఒకసన్నని పెనసలు గీత వంటిది ఒకటి పొడుగునా వుంది. దాన్ని చేత్తో తాకిచూస్తే గరుగ్గా అతికినట్లు తోచింది. దీనినిబట్టి ఆ నేర్పరి ఒక వజ్రం పొదగబడిన పనిముట్టుతోనూ—కరెంటు సహాయం వల్లనో ఆ పెట్టెను సులువుగా చీల్చి, మళ్ళీ అతికేసి వుంటాడని గ్రహించాను.

ర : యిప్పుడీ యినపపెట్టెకు గూడా అలాంటి గురుతు ఏదయినా వుందేమో చూదామా ?

మాధ : చూదాము పదండి.

అప్పుడు మాధవరావు రమేశచంద్రు లిద్దరూ యినుపపెట్టె వున్న గదిలోనికివెళ్ళి, పెట్టెను నాలుగువైపులా పరీక్షించి జూసారు. దానికి కూడా వెనుకతట్టున అంతకుముందు మాధవ రావు జూసినటువంటిదే వొక గీత వుంది, దాన్ని రమేశచంద్రు ముట్టుకు జూస్తే గరుగ్గావుంది. అప్పుడతను ఆశ్చర్యంతో—

" మాధవరావుగారూ ! మీరుచేసిన యీ పరిశోధన నిజమయిందే, మీ ఆఫీసులోని యినుపపెట్టెను కోసి అతికించినట్టె, దీనిని గూడా ఏదో వింత పనిముట్టుతో కోసి అతికించినట్లు స్పష్టంగా కనిపిస్తూంది.

మాధ : ఎందుకు సందేహం ? వాడూ వీడూ ఒక్కడే ఒక్క చేతిమీదనే యీ పనులన్నీ జరుగుతున్నాయి.

ర : మీరు చెప్పేదంతా నిజం.

మాధ : నా దగ్గర ఎన్నో సంవత్సరాలనుంచి వుండి, ఈ మధ్యనే పోయినటువంటి దంతపు పిడికి అతికించబడిన పులిగోళ్ళకు చివర ఏదో తళతళ మెరుస్తుండేది. " దానివల్ల యినుము సహితం సులువుగా కోయబడుతుంది. అదిగాని మనిషి శరీరానికి తగిలిందా, అతను మంచినీళ్లు అడగకుండా చస్తాడు " అని మా నాయన చెపుతూవుండడం నా కిప్పుడు జ్ఞాపకాని కొస్తూంది. అలాగున వినడమేగాని, యెప్పుడూ ప్రయత్నించి జూడలేదు నేను.

రమే : ఆ పులిగోళ్లను కూడా ఈ దొంగే అపహరించాడు దాని సహాయం వల్లనే అతడిలాంటి పన్నీ చేస్తున్నాడనడంలో సందేహం ఎంతమాత్రం లేదు. దాని సంగతిని మీ రింతకుముందు ఎవరితోనయినా చెప్పారా ?

మాధ : ఏదో మాటలప్రస్తావన వచ్చి ఒకనాడు అరవింద బాబుతో అన్నాను. అప్పుడక్కడ గోపీచందు కూడా వున్నట్లు జ్ఞాపకం. సరిగా గుర్తులేదు.

రమే : అరవింద బాబుగాని, గోపీచందుగాని యిటువంటి ద్రోహం తలపెడతారని నే నెప్పుడూ అనుకోను.

మాధ : వాళ్ళ ననుకుంటె మహాపాపం కూడాను.

రమే : మీరప్పు డాలాగున చెబుతూన్నప్పుడు తోటలో పనిచేసే ఏకూలీ వాడైన ఈ రహాస్యాన్ని ఎరిగి, ఆ పులిగోళ్ళను అపహరించి. యీ కుట్ర అంతా సాగిస్తూవున్నట్లు తోస్తుంది ఏమంటారు ?

మాధ : నాకూ అలాగునే తోస్తూంది.

రమే : ఇప్పుడు మనకు మరికొంత అవకాశం దొరికింది. దొంగను నిర్ధారణ చెయ్యడానికి.

మాధ . ఇంత మాత్రానికా దుర్మార్గుడు దొరుకుతాడా ?

రమే : మీ పులిగోళ్లు ఎవరిదగ్గర వుంటే వాడే దొంగ అని మనం సులువుగా తెలిసికొనవచ్చును.

మాధ : ఈ విషయంలో మనం తీవ్రంగా పనిచెయ్యాలి.

రమే : అం ! ఎంతడబ్బు ఖర్చు అయినా సరె ప్రయత్నం మానరాదు. ఇప్పుడు మనమేమి చెయ్యాలో చెప్పండి.

మాధ : ఈ వారంతో మన టీ సీజను పూర్తి అయి పోతుంది. అక్కడింక ఏమీ పనివుండదు. అక్కడ ఆఫీసు ఎత్తేద్దాము. మళ్ళీ సీజను వచ్చేటప్పటికి ఆలోచించవచ్చు. ఆ ఆఫీసు ఎత్తేస్తే అరవిందబాబూ, గోపీచందూ కూడా ఇక్కడకే వస్తారు. వాళ్లుకూడా మనకు సాయపడతారు. ఈ వ్యవహారంలో.

రమే : మీరు చెప్పిన సలహా బాగుంది. కాని, ఆఫీసు ఎత్తేస్తే కూలీలందరూ చెల్లాచెదరై పోతారుకదా. వాళ్ళలోనే దొంగవుంటే మన మెల్లాగ పట్టుకోగలము ?

మాధ : మీకా సందేహం అక్కరలేదు, అక్కడ ఆఫీసు ఎత్తివెయ్యగానే ఆ కూలీలందరూ కూడా, ఆ మిల్లులోను ఆమిల్లులోను పనులకు కుదురుతారు. ప్రతి సంవత్సరము జరిగేది యిది.

మనకూలీలు కూడా ఈ కలకత్తా కాపురస్తులే. వాళ్ళ లిస్టంతా అడ్రసుల సహితంగా నా దగ్గర వుంది.

రమే : అయితే మంచిదే అలాగునే చేదాము.

అని సంభాషించుకొన్న అనంతరం మాధవరావు రమేశ చందుగారి దగ్గర శలవు పుచ్చుకొని, తన బసకు వెళ్ళిపోయాడు. రమేశచందుగారు గూడా ఆఫీసుకు తాళాలు వేయించి ఎక్కడికో వెళ్ళిపోయారు.

## 7

టీ సీజను పూర్తి అయినప్పటి నుంచీ, మాధవరావు కలకత్తాలోనే వుండిపోయాడు. ప్రతిదినం ఒక్కసారి అయినా సుదర్శనరావుగారి యింటికి వెళ్ళడం, అతనితో కొంచంసేపు యిష్టాగోష్టి సలపడం పరిపాటయింది. క్రమంగా వాళ్ళిద్దరకు గాఢమయిన స్నేహం కుదిరింది. ఒక్కొక్కప్పుడు మాధవరావు వెళ్ళినప్పుడు సుదర్శన రావు ఇంటివద్ద లేకపోతే, సత్యవతమ్మ అతనిని ఆహ్వానించి, కుశల ప్రశ్నలు వేస్తూ, లోక వ్యవహారాలను అడుగుతుండేది.

ఒక ఆదివారంనాటి సాయంకాలం మాధవరావు మామూలు ప్రకారం సుదర్శనరావుగారి యింటికి వచ్చాడు. సుదర్శనరావు యింటిదగ్గర లేనట్లు తోచిందతనికి కారు షెడ్డులో లేకపోవడం వల్ల, ఆఫీసుగదిని దాటి, ముందువసారాలో ప్రవేశించాడు. ఇందిర అప్పు డక్కడ ఓ కుక్కపిల్లతో ఆడుతూంది. తలంటుకొన్న తల జడ వదులుగా అల్లి వదలేసింది. గాలితాకున ఆమె నల్లని చిరు వెంట్రుకలు కదులుతోంటె, అందులో నుంచి, రెండుమూడు మల్లె పూలు తొంగిచూస్తున్నాయి. ప్రబంధాల్లో కవుల వర్ణనలాంటి

చంద్రబింబం లాంటిది కాదామె ముఖం—కోలగావుంది. స్త్రీ లోకంలో వుండే సౌందర్యాన్నంతటను ఏర్చి—ముద్దచేసి, యీమెనా బ్రహ్మ సృష్టించాడా అనిపిస్తుంది ఆమెను చూసినవాళ్ళకు. చెవులకు నీలవరాళ్ళ లోలకు లూగులాడుతున్నాయి ఆమె కట్టిన, ఊదా సిల్కుచీరలోనుంచి, పసిడిచాయపు మేను మెరుస్తూంది. కుక్కపిల్లతో ఆడుతూన్న ఇందిర వెనుకతట్టున నిల్చి తన సౌందర్య మధువును గ్రోలుతూన్న మాధవరావు రాకను గుర్తించనయినా లేదు. అప్పుడే అస్తమిస్తున్న సూర్యుడి అరుణకాంతులు ఇందిరమీద వాలడంచేత, ఆమె ఒక ప్రకాశించె బంగారు ప్రతిమలాగ మాధవరావుకు కనుపించింది. ఐన ఊహా పథాలనుండి దాటిపోయిన ఆ దివ్యమోహన రూపాన్ని ఆరాధించుకొంటూ మాధవరావు అలాగుననే ఇందిరకు వెనుకతట్టున నిలబడిపోయాడు. అవతరించిన అపర భారతివలె, కనిపిస్తున్న ఇందిరలో వుండే ఏదో బ్రబలశక్తి మాధవుణ్ని ఆకర్షించింది. అతనా శక్తికి తట్టుకోలేక పోయాడు, ఈ ప్రపంచంలో ఇంత సౌందర్యం ఉందని అప్పుడే అతనికి తెలిసింది. 'ఇందిర వితంతువు' అని అతని హృదయ ప్రపంచానికి తట్టినపు డాతని నేత్రాంచలాలనుంచి, రెండు మూడు కవోష్ణ భాష్పాలు జారి నేలపైబడి అప్పటికప్పుడే ఇంకిపోయినవి.

ఇందిరతో చెలగాటాల నాడుతున్న కుక్కపిల్ల తటాలున ఆమె వెనుకతట్టునకు మళ్ళడంచేత, ఆ సౌందర్యమూర్తి కూడా దానివైపు మళ్ళి, అక్కడ నిలుచున్న మాధవరావును జూడగానే ఉలికిపడి లేచింది. అప్పుడామె నల్లకలువల్లాంటి కళ్ళల్లో పున్నమ చంద్రుణ్ని చూసాడు మాధవుడు. ఆమె గులాబి పెదవులపై

ఎందుకో మందహాసం మొలకలెత్తగా హంసలను గూడా సిగ్గు పరచే తన సొగసు నడకలతో ఆమె వెనుదిరిగి వడివడిగా నడచి వెళ్ళిపోతూంది. మబ్బులోని మెఱుపల్లె ఆమె గమనం మాధవ రావుకు కళ్లు మిఱుమిట్లు గొల్పింది. అప్పుడు స్వప్నమయ జగత్తు నుంచి మేల్కొన్న మాధవరావు అప్రయత్నంగా 'ఇందిరా' అన్నాడు.

ఆమె ఆగింది—

"మామయ్యగా రెక్కడ ?

"డిన్నరు పార్టీకి....'

అప్పుడామె అధరాగ్రం నుంచి అమృతం గ్రుమ్మరించింది.

'అమ్మగారూ"

"పంపుకు"

అని ఇందిర అంది. తన పాలభాగాన్ని ఏర్పరిచిన చిరు చెమటలను నఖాగ్రాల మీటుతూ. ఆమె నేత్రాలు నక్షత్రాల్లా మిల మిల మెరుస్తున్నాయి.

"ఇందిరా ! నేను నీతో మొదటిసారి మాటాడడం ఇదే కదూ"

"...................'

ఆమె నునుసిగ్గు దొంతరులామె ప్రయత్నించిన మధుర వాణిని కంఠంలోనే అణచివేసాయి. తల వంచినప్పుడామె పొడి వెంద్రుకలు ముఖంమీదపడి గాలితాకున తటతట కొట్టుకొన్నాయి. ఆ చెదరిన కురులను సరిచేదామన్న బుద్ధితో మాధవరావు రెండ డుగులు ముందుకు వేశాడు—ఆమెకు దేహంకంపించింది,— కళ్ళు చీకట్లు క్రమ్మాయి. గుండెల్లో అదటు బయలుదేరింది.

" నామాటలు నీకు కష్టంకలిగిస్తున్నా యనుకుంటా "

" లేదు ' అని చెప్పడానికి ఆమె తల పంకించి నప్పుడామె జడలోవున్న మల్లెపూలు రెండూ జారి క్రింద పడ్డాయి—వాటిని విద్దరూ గమనించలేదు.

ఒక్కక్షణం ఎవరూ మాట్లాడలేదు. కాలంస్థంభించి,వారి చేష్టల నట్టె చూస్తున్నట్లుంది.

" మీరు రామనగరంలో వున్నప్పుడు నేను మీ యింటికి రావడం జ్ఞాపకముందా "

" ఊఁ "

" ఆమొదటి రోజున నువ్వు నాకు నీళ్ళు—పండ్లపొడి తెచ్చి యివ్వలేదూ "

" ఇప్పు డదంతా యెందుకు "

" నువ్వు ఎప్పుడు నాకు మెరుపులా మెరసి కనపడకుండా మాయమయ్యా "

' ఏమో '

" మొన్న ఈఆఫీసుగదిలో మామయ్యా, మేమందరమూ మాట్లాడుకొంటూ వున్నప్పుడు నువ్వి కిటికీలోనుంచి—నావైపు గుచ్చి గుచ్చి చూసావెందుకు "

" నాకు తెలియదు " ఆమెతల సిగ్గుచేత భూమిలోకి వంగి పోయింది.

" ఆ వాడిచూపులు నా హృదయానికి సూదుల్లా తగిలాయి "

" అదినాతప్పుకాదు "

" ఎవరిది "

" నాకు తెలీదు "

"నేను మొదటిసారి నిన్ను జూసినప్పుడే నాహృదయం స్పందించింది ఇందిరా! ఎందుకు దాచడం"

"అప్పటినుంచీ నేను మీ మధురమూర్తిని నా హృదయ పీఠాన నిలుపుకొని ధ్యానించుకొంటూనే వున్నాను"

ఆ మాటలను విన్న మాధవరావుకు అమృతమును గ్రోలి నట్లయింది. వేగంగా కొట్టుకొనే గుండెలతో అత నామెకు దగ్గ రగా నడచాడు. "నేను అభాగ్యను" అన్నదామె చలించిపోయే పెదవిరేకులతో. అప్పుడు తళతళలాడే ఆమెచెక్కులపై కుంకుమ కాంతులు వెలిగాయి శరీరము కంపమెత్తింది.

మాధవరావు చేతు లప్రయత్నంగా ఆమెను కౌగలించాయి. ఇందిర అతని బాహు వల్లరినుండి తప్పించుకోడానికి ప్రయత్నం చెయ్యలేదు. 'అమ్మ వస్తుందేమో' అని అన్నదామె సముద్ర తరంగాలవలె అల్లకల్లోలంగా వున్న వికలితహృదయంతో. ప్రేమ తీపున మైకంగప్పిన మాధవరావామె అధరములను చుంబించాడు. పుట్టినదాదిగా నాటివరకు పురుషస్పర్శనానుభవం ఎరుగని ఆముగ్ధ రాలు మాధవుని సందిటిలో అరమోడ్చిన కన్నులతో వ్రాలి— అదిస్వప్నమో యెదార్థమో తెలిసికొనలేక కొట్టుకొంటుంది. భావో ద్రేకంచేత మాధవుని హృదయం కంపించింది. అపుడా ప్రేమ మయు లేదో అనిర్వచనీయ మహాసౌఖ్యమును అనుభవిస్తున్నట్లు ఈ భౌతిక ప్రపంచాన్ని ఒక్కక్షణం మరిచారు. తమ జన్మలు చరితార్థత నందినవనుకుని కన్నులు మూసుకొన్నాం.

వీధి గుమ్మంలో అయిన పదధ్వని, ఒడలుతెలియని ప్రేమ స్వాదనా నందమయ జగత్తులోవున్న ఆ యువతీ యువకుల కర్ణ పుటాలలో జొరపడలేదు. ఇంతలో సత్యవతమ్మ భుజాన నీటి

బిందెతో లోపల ప్రవేశించి, అక్కడ కగుపడుచున్న దృశ్యాన్ని చూసి, తన కన్నులను తానే నమ్మజాలక పోయింది. "ఇందిర ఒక యువకుడి బాహువల్లరిలో—ఛీ! నా కన్నులు నన్నే మోసగిస్తున్నవి—వట్టి భ్రమ" అని అనుకొంటూనే రెండడుగులు వెనుకకు తగ్గి, బిందెనక్కడ దింపుకొన్నది. ఆ బిందె చప్పుడువల్ల ఆ చైతన్య రహితులకు మత్తు విరిగింది. ఆ బిందె చప్పుడు వాళ్ళ హృదయాలలో ప్రబలఘంటా రావమై మ్రోగింది. సత్యవతమ్మను జూడగనే వారు కౌగిలింతలోనుంచి విడివడ్డారు. ఈ దృశ్యాన్ని కండ్లారా చూసిన సత్యవతమ్మకు నోట మాటరాలేదు. శరీరం కొయ్యబారిపోయింది. ఇందిర ఆ క్షణంలోనే మాయమైంది. మాధవుడు వణుకుతూన్న కాళ్ళతో దారిలోకనబడిన సత్యవతమ్మను చూడనయినా చూడకుండా వీధి చావడిలోకి వచ్చేసాడు. అతని బుర్రలో వేయి ప్రపంచాలు గిర్రున తిరుగుతున్నాయి. ఆఫీసు గదిలో కుర్చీలు—బల్లలు—ఒకటికి ఇరవైలా కనుపించాయి. అతడు వెనుదిరిగి చూడనయినా లేదు. అప్పుడతని కెక్కడలేని బలమూ వచ్చింది. వడివడిగా వీధిగుమ్మం దిగి—తన్నెవరో తరుముకొని వస్తునట్లు పారిపోయాడు.

తరువాత, జరిగిన విషయము నంతనూ అవగాహన చేసికొని, తాను గాంచినది యెదార్థ విషయమే నవిన్నీ, మాధవరావు ఇందిరను తన ప్రేమ ప్రవాహంలో ముంచెత్తి, ఆమె తన జీవితంలో ఎన్నడూ ఎరగని ఆనందానుభవాన్ని కలిగించి, వలపించుకొన్నాడనీ తెలిసికొన్నప్పుడు సత్యవతమ్మ కొకసారి ఆనందోన్మాదం కలిగింది—వెంటనే ఒక కారుమబ్బు తనకు పూర్ణచంద్రుణ్ణి కప్పినట్లు ఆమె హృదయం విచారమేఘావృతమై కల్లోలపరచింది-

సంఘం తన భయంకర సహస్రనాలుకలతో నోరును తెరచుకొని ఇందిరను మ్రింగివేయడానికి జూస్తున్నట్లామె దృష్టిపథాన గోచరించినది. "వితంతువయిన నా బిడ్డ యొనర్చిన యీ తప్పిదము నకు సంఘం హర్షించదు. సంఘకఠినబద్ధ చట్టాలముందు నా తల్లి యొనర్చిన తప్పు క్షమింపరానిది" అని సత్యవతమ్మ అనేక విధాల తలపోసి, ఇందిరకోసం ఇల్లంతా వెదకింది. కాని ఆమె ఎక్కడా కనుపించలేదు.

"అయ్యో! నా తల్లీ ఏమయిపోయింది! ఇల్లంతా వెదకినా కనబడవేమీ నేను తమ వలపుచేష్టలను జూసినందుకు భిడియపడి, ఏ అఘాయిత్యమయినా చెయ్యలేదుకదా! దిక్కుమాలినదాన్ని నేనూ అదే సమయానికి ఎందుకు రావాలి? ఆ దుర్భరమయిన నా దృశ్యం నా కండ్లకు యెందుకు పడింది? ఇలాగున ఇంతకు ముం దెన్నిసార్లు జరిగిందో ఎవ్వరు చెప్పగలరు?

ఇన్నినాళ్లూ మాధవరావును గురించి, ఇందిర నాపై కురిపించిన ప్రశ్నల పరంపరల కర్థం తెలిసికోలేని నా అమాయకపు హృదయాని కిప్పుడా ప్రశ్నలకు ఫలితం గోచరించింది. ఇది సంతోషింపవలసిన విషయమో, విచారింపవలసిన విషయమో కూడా నా కర్థం కావడంలేదు. ఏది ఏమయినా నా తల్లికి కించిత్తు ఖేదంగాని—అపాయంగాని కలిగినా నేను భరించలేను. ఇన్ని సంవత్సరాలనుంచి అల్లారుముద్దుగా పెంచిన నా తల్లికి ఏమయినా అపచారం జరుగుతే యీ తల్లి ప్రాణం ఎగిరిపోతుంది కాని— ఇంకేమీలేదు—

"అమ్మా ఇందిరా! ఎక్కడున్నావు తల్లీ" అని కేకలు వేస్తూ యిల్లంతా తిరిగినా ఆమె పిలుపుకు సమాధానం లేకపోవడం

ఆ తల్లి ప్రాణం, తల్లడిల్లిపోయింది. ఆమె వణుకుతున్న కాళ్ళతో మేడకూడా యెక్కింది. అన్ని గదులూ వెదకింది. ఇందిర ఎక్కడా కనుపించలేదు. సత్యవతమ్మ కళ్ళంట అప్రయత్నంగా నీటి బిందువులు జలజల రాలాయి "నా తల్లి ఏమయిందో-నేనిప్పు డేమి చెయ్యాలి—" అని దుఃఖిస్తూ ఆమె మళ్ళీ వెదుకుతూ ఓ మూలనున్న గదిలో ప్రవేశించింది. అక్కడ—ఇందిర ఒక పరుపుచుట్టలో తలనుదూర్చి, గుండెలు బ్రద్దలయ్యేటట్టు వెక్కి వెక్కి యేడుస్తూంది. సత్యవతమ్మ ఆమెను చూడగానే, కన్నులు చిల్లులుపడ్డట్టు నీరు కారుస్తు, ఇందిరను లేవదీసి, తన వొడిలో చేర్చుకొని "ఎందుకు తల్లీ! ఏమొచ్చింది? ఎందు కిలాగున ఏడవడం? ఊరుకో. నీ కొచ్చిన భయంలేదు" అని తన చీర చెరగుతో, ఆమె కళ్ళంటకారె నీళ్ళను తుడుస్తూ చెదరిన ముంగురు లను సరిజేర్చి. లాలించి, ఓదార్చడం మొదలుపెట్టింది. ఏదో మహాపరాధం చేసినదానిలాగ ఇందిర తల్లిముఖం జూడలేక పోయింది. తల్లి వొడిలో తలదూర్చి—ఇంకా అలాగునే వెక్కి వెక్కి ఏడవడం మానలేదు.

తమ బిడ్డలు ఎటువంటి తప్పుపనులను చేసినా, వాటిని తల్లులుగాక ఇంకెవ్వరు సహించుకోగలరు. సత్యవతమ్మ అనేక విధాల ఇందిరను బుజ్జగించి—ఎంతో ప్రయత్నమీద ఆమె దుఃఖాన్ని కొంతవరకూ అరికట్టి, "తల్లీ! నీ ప్రాణం వుండగా నీ కెటువంటి భయమూ లేదుతే. మాధవరావును నువ్వెంత గాఢంగా ప్రేమించిన విషయం నాకిపుడు పూర్తిగా తెలియడం కూడా ఒకందుకు మంచిదే. మీ యిరువురి ప్రేమా వనపుష్పంలా-రాలి నశించిపోతుందో లేక, దిన దినమూ వృద్ధిపొంది మంచిగా

ఫలిస్తుందో ఎవరు చెప్పగలరు తల్లీ! ఏది యెలాగునవున్నా నువ్విలాగ గుండెలు ప్రీలిపొయ్యేటట్టు ఏడుస్తే, నాకు మనస్సు చెదరిపోతుంది—ఊరుకో " అని సత్యవతమ్మ, ఇందిర చెక్కులు విమురుతూ అన్నది.

" అమ్మా! ఈ సంఘ:దృష్టిలో నాతప్పు క్షమింపరానిది" అని ఆమె మళ్ళీ కుమిలి కుమిలి యేడవడం మొదలు పెట్టింది.

" తల్లీ! వూరుకోవూ! మామయ్య వచ్చే వేళకూడా అయింది. అతగాడికీ సమాచారం తెలుస్తే మనలను బ్రతకనివ్వడు. ఇక వూరుకోతల్లీ—" అని సత్యవతమ్మ ఇందిరతో అంది.

మామయ్యమాట వినగానే ఇందిర ఎక్కడి దుఃఖాన్ని అక్కడ దిగమ్రింగింది. సుదర్శనరావంటె ఆమెకు అమితభయం. సత్యవతమ్మ చెప్పిన మాటలనుబట్టి ఈ తన రహస్యాన్ని ఆమె తన గుండెల్లో దాచగలదని ఇందిరకు కొంత దయిర్య కలిగింది. ఈలాగున భగ్నమయిన తమ ప్రేమనుగురించి మాధవు డెంతగా విచారిస్తున్నాడో అని ఆలోచించడానికి ఇందిరకు అప్పుడు కొంత సావకాశం కలిగింది, అంతవరకూ ఆమె ఈ ప్రపంచంలోనే లేకుండా వుంది. తన జీవితంలో ఆనందరసానుభవంగల ఘట్టం అది వొక్కటే అని ఇందిర తనలో అనుకొంది. విశేషమయిన దుఃఖమయ ఘట్టంకూడా అదేనని ఆమె తరువాత అనుకొన్నది. దాని ఫలితం ఎలాగున ప్రవర్తిస్తుందో ఆమెకు మాత్రం ఏమి తెలుస్తుంది పాపం!

ఇందిర గుమ్మంలో కారు ఆగిన చప్పుడయింది అప్పుడు సత్యవతమ్మ ఉలికిపడి " తల్లీ! మామయ్యా వచ్చాడు. కళ్ళు తుడుచుకో శుభ్రంగా. క్రిందికి వెడదాము " అంది. వెంటనే

ఇందిర కళ్ళను ముఖమును, ఎక్కడా చింతారేఖలు కనపడకుండా తుడుచుకొని, తల్లితో మేడమెట్లు దిగి క్రిందకు వెళ్ళింది. ఇంతలో సుదర్శనుడు లోపల ప్రవేశించిన జోడుచప్పుడును విని, ఇందిర సురోక గదిలోకి పోయి—వేగంగా కొట్టుకొనే హృదయంతో తన కెటువంటి ప్రమాదమూ రాకుండా కాపాడుమని భగవంతుణ్ని ప్రార్ధించుకొంటూ పడుకొన్నది.

## 8

మార్గంలో పరుగెత్తుతూవున్న మోటారుబండ్లు బైసికిళ్లు-జట్కాలు మనుష్యులు-అన్నీకూడా గిర్రున తిరుగుతు వున్నట్లై కనుపించింది. సువర్ణనువి యిల్లువిడిచి, దొంగలాగున వడివడిగా నడచిపోతూన్న మాధవునికి ఎల్లాగునయితే నేమి చెదరిపోయిన హృదయంతోను, ఎగసివచ్చే వేడియూర్పులతోను మాధవుడు బసచేరుకొనే టప్పటికి చాలాచీకటి పడింది. గదితలుపు తాళంతీసి, లోపల ప్రవేసించి, తలుపునుమళ్ళీ బిగించుకొని, దీపారాధన చేద్దామని చూనేటప్పటికి మాధవరావునకు అగ్గిపెట్టె కనుపించిందికాదు. అలమారులోను—ప్రక్కమీదా ఆ చీకట్లోనే తడుములాడాడు చాలా సేపు. మనస్సు సరిలేక పోవడంవల్ల వెదకిన చోటునే మళ్ళీ వెదకుతు ఒక పావు గంట చూశాడు. విసుగొచ్చింది—చివరకు ఏడుపుకూడా వచ్చింది. "ఛీ! ఇటువంటి కష్టమయమయిన జీవితం గడపడంకంటె చస్తే మేలు" అనుకొన్నాడతను నిస్పృహజెందిన హృదయంతో. గదిఅంతా అగ్గిపెట్టెకోసం ఆ చీకట్లో తడుములాడగా తడుములాడగా అది ఓచోట అతని కాలిబూటుకు తగిలింది. అతనెంతో ఆశతో దాన్ని వెలిగిద్దామని తీసేటప్పటికి అది ఖాళీపెట్టె అయి

పూరుకుంది. అప్పుడతనికి ఎక్కడలేని విసుపు—దానితోపాటు కోపము, దుఃఖము కలిగాయి—ఆ అగ్గిపెట్టెను బలంకొద్దీ నేలకేసి కొట్టాడు. అది స్జీవపదార్థము కాబట్టి సరి పోయింది· మరేదయినా అవుతే ఆ క్షణంలోనే ప్రాణాలు విడచేది.

ఇక అగ్గిపెట్టెకోసం వెదకడం నిరర్థకమని, పక్కదులు పు కొని, " ఇస్సురంటూ అతను ఆ కాలిబూటుతోను—కోటుతోను అలాగే ప్రక్కమీద వ్రాలాడు. ఆ బుర్రలో రోడ్లుపరుగెత్తడం, నదులు ప్రవహించడంలాంటి ఎన్నెన్నో చిత్రాలు జరుగుతున్నాయి. ఆ చికాకులో అతనా పూట భోజనంమాటె మరచిపోయాడు. నిద్రపోతే అంతా సర్దుకుంటుందని చూసాడు. కాని అటువంటి సమయంలో నిద్ర ఎలాగున పడుతుంది. గట్టిగా కళ్ళు మూసు కొన్నాడు. ఒకటి కాదు—రెండు కాదు. అతని హృదయంలో ఎన్నెన్నో ఆలోచనలు పరుగులెత్తడం మొదలుపెట్టాయి—

" పాపం ! అనవసరంగా నన్నుగురించి ఇందిర ఘోర మయిన చిక్కుల్లో పడిపోయింది. ఎంత తెలివితక్కువ పనిజరి గింది ! ఎంత తొందరపడ్డాను. నేనామెను కౌగలించుకో బోయి నప్పుడామె తిరస్కరించినట్లయితే ఇంత ప్రమాదం వచ్చివుండదు. పాపం అక్కడకూ అన్నది " అమ్మ వస్తుందేమో " నని. ఆ మాటలు పశుప్రాయుడ నయిన నా చెవుల్లో అప్పుడు పడలేదు. అలాగున మేము దేహాలను మరచి కౌగలింతల్లో కేరింతాలు కొట్టడం ఆయిల్లా లెంతసేపటినుంచి చూస్తూ నిలుచుందో ఛీ ! ఇంకా నా ముఖాన్ని వాళ్ళకి జన్మలో చూపగలనా యోగ్యుడనీ— వివేకుడనీ—శాంతమూర్తి అనీ—పవిత్ర చరిత్రుడనీ, అనిన ఆ నోళ్లే యిపుడు నన్నెన్నో విధాల శపిస్తాయి. ఎంటి అవమాన

కరమయిన విషయము? ఇందిర నామె తల్లి ఎన్నివిధాల బాధ పెట్టి వుంటుందో! ఎన్ని దెబ్బలు కొట్టివుంటుందో! సుదర్శనరావు యీ నా దుష్ట ప్రవర్తనను గురించి తప్పక రమేశ చందుగారితో చెబుతాడు. ఇంతకుముందు రమేశచందుగారికి దొంగ తాను ఇందిరను ప్రేమిస్తున్నానని వ్రాసాడు. ఇప్పుడాయన యీ నా ప్రవర్తన తెలియగానే, ఇంతకుముందు జరిగిన ఘోరకృత్యాలన్నీ నా వలనే జరిగాయని అనుమాన పడడానికి అవకాశం వుంది.

అయ్యో! నా బ్రతుకెంత నీచమయిపోయింది. రేపు ప్రజల ముఖాలను నేనేముఖం పెట్టుకొని జూడగలను? సుదర్శనరావు నన్ను క్షమిస్తాడా? సత్యవతమ్మ యీ నా చెడునడవడి నెన్ని విధాల దూరుతుందోకదా. ఇన్నినాళ్ళనుంచీ శాంతంగాను—ఆనందంగాను జరుగుతూవున్న ఇందిరయొక్క ప్రశాంత జీవితాకాశంలో ప్రబల తుపాను చెలరేగడానికి నేనేకారణం. ఆమె నా ప్రాణానికి వుసూరుమని దుఃఖిస్తూవుంటుంది. తల్లి చేతుల్లో అతిగారాబంగా పెరిగిన ఆమె యిపుడందరిచేతా గర్హింపబడుతూ వుంటుంది. ఇది మా యిరువురి జీవితాలలోనుకూడా మాయని మచ్చకదా!

అక్షణమలాంటిది, నేనుమాత్రం ఏంచెయ్యగలను. అప్పుడు నా కామె అపరరతీ దేవిలాగున కనిపించింది. ఎన్నడూ ఎరుగని నా హృదయం స్పందించింది. ఆమెలోవుండే ఏదో ప్రబలశక్తి నన్నావరించి, నన్నామె దగ్గరకు గొనిపోయి బాహువల్లికలో బిగవేసికో జేసినప్పుడు, నావల్ల యేమవుతుంది? ఆ ప్రేమమయ దివ్యమూర్తి నా పరిస్థితిలో జూచినపుడు నాకి యితర ప్రపంచమే తెలియలేదయ్యో. ఇంతకూ నా దుర్దినములివి. నా బ్రతుకు నలుగుర నోళ్ళలోనూ పడవలసిన కాలంవచ్చింది కాబోలు. అంతటితో సరి

పోతుందా ? సుదర్శనరావు తమ వంశ గౌరవాన్ని మంటగలిపిన నాపై పగ సాధించక మానడు. రమేశచందుగారీ నా తప్పును క్షమింపరు—ఉద్యోగంలోనుంచి వెంటనే తప్పుకో మంటారు. ఈ అన్నిటికీ తోడు ఇక ఇందిర ఏ జన్మలో చూడడానికైనా నాకు యోగ్యతలేదు. ఇందిర నా కందరాని గగనకుసుమం. ..."

అలాగున మాధవరావు అనేక విధాల దుఃఖించి చివరకు రాత్రి రెండుగంటలు దాటాక, ఆవేదనా హృదయంతో నిద్దర పోయాడు. నిద్రాదేవి సకలప్రాణులకు సర్వదుఃఖాలను మరపించే తల్లియొడికదా !

ఆ మరునాటి వుదయం తొమ్మిదిగంట లయింది. అప్పుడే ముదిరిన భానుకిరణాలు కిటికీగుండ ప్రసరించి, మాధవుని శరీరముపై పొడిచాయి. అప్పు డతను బరువెక్కిన హృదయంతో మేలుకొన్నాడు, రాత్రి భోజనం చెయ్యకపోవడంవల్ల నీరసం ఎక్కువగావుంది. అలాగే లేచి, కాలకృత్యాలు తీర్చుకొని ఏమి చెయ్యడానికీ తోచకుండా, బయటకు పోయి, తన పాడుముఖాన్ని ప్రజల కెలాగున చూపడమూ, రమేశ చందుగారి దగ్గరకు కప్పటి కప్పుడే సుదర్శనుడు వచ్చి, గతదినం తా నాచరించిన నీచ కృత్యాన్ని ఆయనతో చెప్తూ వుంటాడు. వారికేమని సమాధానం చెప్పడమూఅని వెయ్యివిధాల ఆలోచిస్తున్నాడు. అతనికేమీ పాలు పోవడంలేదు. వెర్రివాడలా గదిలో అటూఇటు తిరుగుతున్నాడు. తలుపుగడియైనా తీయకుండా.

ఇంతలో తలుపు నెవ్వరో తట్టి పిలిచినట్లయింది. మాధవరావు వణకుతున్న వేళ్ళతో మెల్లగా సందేహిస్తు గడియదీసి తలుపు తెరచి చూసేటప్పటికి, అక్కడ ఆఫీసు కుర్రాడు నిలుచున్నాడు—

"ఏం ?"

"రమేశచందుగారు మిమ్మల్ని రమ్మన్నారు"

ఆ మాటలు వినగానే మాధవుని ప్రాణాలు నిలువునా ఎగిరి పోయినాయి" అనుకొన్నంత పనీ అయింది. సుదర్శనం కూడా అక్కడ వుండివుంటాడు. నా ఖర్మ ఎలాగున కాలింది ? ఇప్పు డక్కడకు వెడితే నా మర్యాద దక్కదు" అని ఆలోచించి కుర్రాడితో "నాకు ఈ పూట వంట్లో బాగాలేదు. రాలేనన్నానని చెప్పు" అన్నాడు. ఆ మాటలు చెవిని పడగానే కుర్రాడు తిరుగు ముఖం పట్టాడు. చాలా నీరసంగా వుండడంచేత ఆ కుర్రాడిచేత ఏమయినా తినేందుకు తెప్పించుకుందామని తలచి, మాధవరావు వెళ్ళిపోతూన్న కుర్రాడిని పిలచి, వాడిచేతికి ఫ్లాస్కును—కొన్ని అణాలను యిచ్చి "హోటలుకు పోయి దీనిలో కాఫీ—తినేందు కేదయినా తే" అని చెప్పి పంపాడు.

కుర్రవాడు హోటలుకు వెళ్ళాక—

"రమేశచందుగారిప్పుడు నేను వెళ్ళకపోతే మరీ క్రోధం వహిస్తారేమో. వెళితే నలుగురముందూ నా ముఖం వాచేటట్లు చివాట్లు తగలడమో—వుద్యోగంలోనుంచి తప్పుకోమనడమో జరిగి తీరుతుంది. సుదర్శనుడెంత ఆగ్రహిస్తాడో—బూటుకాలుతో తంతాడో యేమో. ఏది ఎలాగున వున్నా ప్రస్తుతం వాళ్ళకళ్ళ పడకుండా వుండడమే మంచిది" అని స్థిరపరచుకొనే టప్పటికి కుర్రాడు ఫ్లాస్కుతో కాఫీ, కొన్ని ఫలహారాలనూ తెచ్చి బల్లమీద పెట్టి వెళ్ళిపోయాడు.

మాధవరావు కాఫీతాగి తలుపు బిగించుకుని మళ్ళీ పక్క మీద కూచుని తానా చిక్కు పరిస్థితిని దాటడం ఎలాగునా అని పరిపరి విధాల ఆలోచించడం మొదలుపెట్టాడు.

"ఇందిర హృదయం అగాధమయినది—ఆమె నన్ను మన సారా ప్రేమించిం దనడంలోనేను పొరబడడంలేదు." అప్పటినుంచీ నేను మీ మధురమూర్తిని హృదయపీఠాన నిలుపుకొని ధ్యానించు కొంటూనే వున్నాను" అని అప్పుడామె అన్న వాక్యంలో ఎంతటి మార్దవం వుంది—ఎటువంటి గంభీరమైన భావం వుందీ! ఆమె తన హృదయాన్ని విప్పి చూపడానికి అంతకంటె ఇంకేమి ప్రబల విదర్శనం కావాలి? ఆమె అలాగున అన్నప్పుడు ఆ లేత గులాబీ రేకులవంటి నునుచెక్కులు చెమర్చడం నేను గుర్తించాను. ఆమె కెంపుపెదవు లెందుకో కంపించాయి. చేతికందిన అమృత పాత్రను ఒలకబోసుకొన్న నావంటి విర్భాగ్యు డింకెక్కడా వుండడు. నిష్కారణంగా ఆమెకు నా మూలమున తీరని కళంక మాపాదించింది. నా ప్రతిష్ట అంతా దుమ్ములో కలసిపోయింది. ఎంత విచారించినా నే నాచరించిన తప్పుడు కార్యం కూడిరాదు. "మాధవరావు ఇందిరను మానభంగం చేసాడు" అన్న మచ్చ నా జీవితంలో ఎన్నడూ చెరగనిది. తల బ్రద్దలుకొట్టుకొన్నా అది చెరగదు—విషం తాగిచచ్చినా ఆ మచ్చ అలాగున వుండవలసిందే. నాకు వంట్లో సుస్తీగా వున్నదని కబురు పంపాను. ఇదంతా దొంగ టక్కరు అని గ్రహించి రమేశచందుగారు, సుదర్శనరావు యిక్కడికే వస్తారేమో—ఇక్కడినుంచి ఎక్కడికయినా పారి పోతేనో"

ఆ ఆలోచన తట్టినపుడు మాధవుని గుండెలు మరీవేగంగా కొట్టుకొన్నాయి. తలుపు మళ్ళీ చప్పుడయింది.—అతని ప్రాణాలు

నిలువునా యెగిరిపోయాయి. "వచ్చారు కాబోలు భగవంతుడా. ఈ నాముఖాన్ని వాళ్ళ కెలాగున చూపడం—" అని అతను పలక లేదు. తలుపు మళ్ళీ చప్పుడు——

అతను మెల్లగా మంచందిగి, వణకుతున్న కాళ్ళతో నడచి, తలుపు గడను తీసేటప్పటికి అరవిందబాబు తలుపును తోసుకొని లోపల ప్రవేశించాడు. అతన్ని చూడగానే మాధవుని హృదయం కొంత దిట్టపడింది. ఇద్దరూ కూర్చున్నారు. అతను తెచ్చిన వార్త ఎంత కఠోరంగా వుంటుందో అనిమాధవుడు వేదనపడుతున్నాడు.

అర : మీకు వంట్లోసుస్తీగా వుందని చెప్పాడు కుర్రాడు.

మాధ : (లేనిధైర్యం తెచ్చుకొని) అవును.

అర : జ్వరం తగ్గిందా?

మాధ : మరే. రమేశచందుగారు నాకోసం కబురుపంపించిన దెందుకు?

అర : మరి మీరు ఏదయినా మందు పుచ్చుకున్నారా?

మాధ : లేదు లెండి. నిన్ననుగాని యీవేళగాని మన ఆఫీసుకు సుదర్శన రావుగారు వచ్చారా?

అర : లేదు ఏం? అలా అడుగుతున్నా రెందుకు?

రమేశచందుగారిని సుదర్శనరావు కలుసుకోలేదన్న మాట వినగానే మాధవరావు మనస్సు పూర్తిగా కుదుటపడింది. అంత వరకు తనరహస్యం బయటపడలేదని సంతోషించాడు.

మాధ : అబ్బే. ఏమీలేదు. నేను వాళ్ళింటికి వస్తానని చెప్పానులెండి. వెళ్ళకపోవడంవల్ల నాకోసం ఆఫీసుకు వచ్చాడను కున్నాను.

అర : రాలేదు. ఈ పూట మదరాసునుంచి, రాబర్ట్సుదొర వచ్చాడు. మన టీ కంపెనీ తరపున ఆంధ్రదేశము నంతను "డిస్ట్రిబ్యూటర్" (?) జంటు " చేస్తా నంటున్నాడు. ఇప్పుడున్న సరకునంతను " కేష్ " యిచ్చి " స్టాక్ " చేస్తా నంటున్నాడు. ఇంతకుముందే అతనికీ మనకూ జరిగిన " కరస్ పాండెన్సు " అంతా మీరెరుగుదురు కదూ. ఆ విషయమై మీతో ఆలోచించడానికే రమేశ చందుగారు మీ కోసం కబురు పంపారు. సుస్తీగా వున్నట్లువిని, ఏలాగున వున్నదో చూసి, యీ సంగతిని చెప్పిరమ్మని నన్ను పంపారు. ఇదీ సంగతి—

అంతవరకూ విన్న మాధవుడు " కీడులో మేలు " అనుకొన్నాడు. తన యజమాని కింకా తనమీద దయ తప్పలేదనుకొన్నాడు. సుదర్శనుడు తన నీచప్రవర్తనను గురించి వెల్లడి చెయ్యనందుకు పరమానంద భరితుడయ్యాడు. ఇంక ఆఫీసుకు వెళ్ళడాని కెటువంటి అభ్యంతరము లేదనుకొని, అరవిందబాబును చూసి, " అయ్యో ! ఇది చాలా జరుగురయిన విషయం. ఎల్లాగో ఓపిక చేసుకుని వస్తాను. ఒక జట్కా పిలవండి. ఇంతలో డ్రెస్ వేసుకుంటాను " అన్నాడు. వెంటనే అరవిందబాబు ఒకజట్కాను వీధిలో నిలిపాడు మాధవరావు డ్రెస్ వేసుకొని, అరవిందబాబుతో జట్కా నెక్కి ఆఫీసుకు వెళ్ళాడు.

వాళ్ళు ఆఫీసు చేరుకొనేటప్పటికి వచ్చిన క్రొత్తదొరగారూ రమేశచందు, మాట్లాడు కొంటున్నారు. రమేశచందు మాధవరావును దేహస్థితిని గురించి అడిగిన తరువాత, అప్పటి వ్యవహారమంతా చెప్పాడు మాధవరావు కూడా దొరతో మాట్లాడి—అతని " టి ప్రజంటేషను " ఆమోదించేటట్లుచేసాడు. అంతకు ముందున్న

" క్లాజు " లకు ఇంకో రెండుమూడు క్రొత్తవిచేర్చి, అగ్రిమెంటు రాయించేడు. అతని తెలివితేటలకు వ్యవహారజ్ఞానానికీ, రమేశ చంద్ర చాలా సంతోషించాడు. వెంటనే దొర లక్షరూపాయలకు ఒక చెక్కును రమేశచందుగారికిచ్చి, త్వరలో స్టాకు మదరాసు చేరే యేర్పాటు చెయ్యవలసినదని చెప్పి వెళ్ళిపోయాడు. అప్పుడు తాము చేసినది చాలా లాభసాటి బేరమేనని, రమేశచందూ, మాధవరావు అనుకొన్నారు.

## 9

ఆనాడు సుదర్శనరావు తన విశ్రాంతి మందిరంలో కూర్చొని పేపరు చదువు కొంటున్నాడు. సత్యవతమ్మ ఆ గుమ్మందగ్గరనే కూర్చొని యేమిటో వ్రాసుకొంటూంది. కొంత సేపటికి సుదర్శన రావు చదువు నాపి సత్యవతమ్మతో అన్నాడు—

" అక్కా ! మాధవరావు నిన్నను మొన్నను కూడా మన యింటికి రాలే దెందుకో "

" ఏమో ! నేనూ అదే ఆలోచిస్తున్నాను "

" ఊళ్ళో లేదేమో "

" ఈ మధ్య ఎక్కడకూ పొరుగూళ్ళు వెళ్ళడంలేదే "

" అటుమొన్నను నేను డిన్నరుపార్టీకి వెళ్ళేముందు అతను కూడా వస్తాడేమోనని చాలా చూసాను. నేను వెళ్ళాక వచ్చాడని నువ్వే చెప్పావు "

" మరే "

" వంట్లో సుస్తీగావుందేమో పాపం "

" లేకపోతే ఆఫీసుతొందరలో వుండాలి "

" అతను కనబడక పోవడంవల్ల నాకు చెయ్యివిరిగినట్లుంది. చాలా మంచివాడు "

" స్నేహపాత్రుడు—యోగ్యుడూను "

" నే నయినా ఈ వేళవెళ్ళి జూసిరావాలి ఓమాటు. లేక పోతే నాకు తోచదు "

" ముఖ్యంగా జూసిరా నాయనా. ఎలాగున వున్నాడో యేమిటో "

" అయితేఅక్కా ! ప్రొద్దుట ఈ వీధిచివర ఏమిటీగల్లంతు జరుగుతున్నది "

" గోపాలరావుగారు. ఎరుగవూ ? ఆయనకో చక్కని కూతురుంది. పాపం ఆ అమ్మాయి మొగుడు చిన్నప్పుడేపోయాడు.

" పోతే "

" అప్పటినుంచీ ఆ అమ్మాయిని చదువులో పడేశారు "

" ఊఁ "

" ఆమె చాలా అందమయినది కూడాను. తనలో చదువు కొనే ఒక యువకుణ్ని ప్రేమించిందట.

" సరి "

" ఆమె, అతను. ఓనాడు కారులో కూర్చొనిషికారు వెడుతుంటె తండ్రి చూసాడుట "

" చూసి ఏంజేసాడు "

" ఆ పిల్ల యింటి కొచ్చాక, ముఖం వాచేలాగున చివాట్లు వేసి, తన మర్యాదగల వంశాని కంతటికీ అపకీర్తి తెస్తున్నావని నిందా వాక్యాలు పలికి ఆమె నవమాన పరచాడు "

" మంచిపని చేసాడు. లేకపోతే, వితంతువు కంత విరగ బాటేమిటి ?

" ఆరాత్రి ఆ అమ్మాయి తనతండ్రిగావించిన అవమానాన్ని సహించుకోలేక విషం మ్రింగి చచ్చిందట "

" అయ్యో పాపం "

" ఈ ఉదయమే ఆమెశరీరాన్ని వీధిలో పారేస్తె పోలీసులు వచ్చి ఇల్లు చుట్టేసారు "

" అలాగునా ? ఎంత గందరగోళం "

" ఇంత వున్నవాడు కనుక ఆయన పోలీసులకు విరజిమ్మి కేసు లేకుండా చేసుకొని, వంశ మర్యాదను కాపాడుకొని, గుట్టు నిలబెట్టాడు "

" అఘోరించినట్టే వుంది గుట్టు. ఇప్పు డెదార్థ విషయం మన మనుకోవడంలేదూ ? ఇంక గుట్టేముంది "

" ఆ అమ్మాయిని ఆ యువకుడికిచ్చి పెళ్ళి చేసేస్తె తీరి పోయేది పాపం ?

" మన వంశాలలో వెధవ పెళ్ళిళ్ళు సహించరు "

" ఇప్పుడో, నువ్వలాగ అంటావుగాని "

" ఆమె చచ్చిపోయినా సంఘం సహిస్తుంది కాని—మళ్ళీ పెళ్ళిచేసుకోవడం మాత్రం సహించదు "

" పాడుసంఘం లెద్దూ ! నూరేళ్ళు బ్రతికే ఆ పిల్లబ్రతుకు ఏలాగున బండలైపోయిందో చూడరాదూ "

" మనశాస్త్రిలు తప్పవు "

" ఏమి శాస్త్రిలురా వల్లకాదు—పాపం ఆ అమ్మాయి పోయిందని విన్నప్పటినుంచీ, నా కడుపులో చెయ్యిపెట్టి కలచి నట్లుంది "

" అది సహజమేలే "

" అల్లాగే, చిన్నప్పుడే భర్త పోతే, ఆ అమ్మాయి దృష్టి మరో పురుషుడిమీద ప్రసరించడం సహజం అని చదువు కొన్న వాళ్ళుకూడా ఎందుకనుకోరు "

" అక్కా ! నేను నీతో వాదించలేనే "

" వాదన కాదురా ! ఉన్నసంగ తంటున్నాను నువ్వుకూడా సర్వం తెలిసి—వివేకము కలిగి—విధవా వివాహాలకు వ్యతిరిక్తంగా వున్నావంటే ఆశ్చర్యమే "

" అయితే మీ యిందిరకు గూడా మళ్ళీ పెళ్ళిచేద్దామని వుందా యేమిటి నీకు "

" చాల్లే. యిప్పుడు దాని సంగతెందుకు ? లోకవిషయాలు మాట్లాడుతుంటె నీ వన్నీ యిల్లాంటి సందర్భంలేనిమాటలే "

" అక్కా ! నిజానికి దూరంగా ఆలోచిస్తే బాల వితంతువులకు మళ్ళీ పెళ్ళిచెయ్యవలసిందే. ఆ సంగతిని నేను ఇప్పుడు మాత్రమే స్థిరపరచుకొన్నాను. కాని మన సంఘం యింకా ఆ కార్యాన్ని సహించుకొనే స్థితికి రాకపోవడవల్ల, నా వంటి తెలిసినవాళ్ళు గూడా విధిలేక ఆ సంఘాశయాలకు దాసోహం చెయ్యవలసి వస్తూంది "

' అది ఆత్మవంచన—బానిస ప్రవృత్తిని '

' అవునుమరి—సంఘాన్ని ఎదురుకొనేశక్తి లేనప్పుడంతె '

' నువ్వుగూడా ఇంతమూర్ఖత్వంగా మాట్లాడడంఆశ్చర్యమే'

' నేను విధవా వివాహం గూడదంటె కదూ. సంఘాన్ని ఎదుర్కొనే శక్తి మనవాళ్ళలో లేదన్నాను '

" అందుకని ఆత్మను చంపుకొంటూ రున్రా "

" అక్కా ! నేను నీకు సమాధానం చెప్పలేనే—రేపుమళ్ళీ

నాకు తీరిక వుండదు. మరి యీపూట మాధవరావును జూసి వస్తాను "

" వెళ్ళిరా "

వెంటనే సుదర్శనం పేపరు నక్కడి పడేసి, కారుకు ఫోను జేసి, దుస్తులు వేసుకోడానికి మరోగదిలోకి వెళ్ళాడు, సత్యవతమ్మ యింట్లోకి వెళ్ళిపోయింది. కారువచ్చి గుమ్మంలో నిలబడగానే " రమేశచందుగారి బంగళాకు " అని డ్రయివరుతో చెప్పి కారు నెక్కగానే, అది క్షణంలో, అనుకొన్న తావుకుబోయి నిలచింది. సుదర్శనుడు లోపలకు వెళ్ళి రమేశచందుగారికి నమస్కరించి, మాధవరావును గురించి, వాకబుచెయ్యగా, ఆయన మాధవరావుకు కొంచెం సుస్తీగా వుంటుందని—రెండుమూడు రోజులనుంచి ఆఫీసుకు రావడం లేదని చెప్పారు. వెంటనే సుదర్శనుడు రమేశ చందుగారి దగ్గర శలవు పుచ్చుకొని, మళ్ళీ కారులో గూర్చొని. మాధవరావు బసకు వెళ్ళాడు. మాధవరావు లోపల గూర్చొని పిచ్చివాడిలాగున యేమేమో ఆలోచించుకుంటున్నాడు. గది తలు పులు తీసేవున్నాయి. సుదర్శనుడు కారుదిగడం చూడగానే మాధవ రావుకు గుండెల్లో దడ బయలుదేరింది—తనువు కంపించింది. " ఈ క్షణంతో నా పనిసరి—ఇందిరకు నేను గావించిన అపకారా నికి తగిన ప్రతీకారం చెయ్యడానికి యమధర్మరాజు వచ్చాడు. తప్పించుకొని బోవడానికి వీల్లేదు. దేవుడిదే భారం " అని మాధవ రావనుకొని ఆమంచంమీద అలాగునే కొయ్యబారి గూర్చున్నాడు. క్రమంగా సుదర్శనుడు లోపలకు వచ్చి, " ఏమండీ మాధవరావు గారూ ! సుస్తీగా వుంటున్నదా " అన్నాడు.

మాధ : ఊఁ (దీనంగా)

సుద : మాకు కాస్త కబురయిన చెయ్యలేకపోయారే.

మాధ : చెయ్యలేదు. (నిస్పృహతో)

సుద : మీరుకనపడని యీ రెండురోజులూ మాకేమీ తోచింది కాదు. మా అక్కయ్య వెయ్యిసార్లు అనుకొన్నది. మీరు రావడం లేదని.

మాధ : (తనలో ఆశ్చర్యంతో) నేను కలగనడం లేదు కదా ! నేను గావించిన మహా ద్రోహానికి ఇతనింత దయగా మాట్లాడతా డెందుకు ? సత్యవతమ్మ నేను రానందుకు విచారిస్తుందా ? వెయ్యివిధాల శపిస్తుందిగాని. ఇదంతా దొంగనాటకం మల్లేవుంది. నిజంగా యితనిప్పుడు నాపై పగ సాధించడానికే వచ్చివుంటాడు.

సుద : ఏమిటి ఆలోచిస్తున్నారు ?

మాధ : ఏమీ లేదండీ !

సుద : ముందు మీకోసం ఆఫీసుకు వెళ్ళాను. రమేశచంద్రుగారు చెప్పారు మీకు సుస్తీగా వుంటున్నదనే. రెండుమూడు రోజులనుంచీ, ఆఫీసుకు సరిగా రావడం లేదనీని.

మాధ : (అమాయికంగా) అలాగునా ?

సుద : పోలీసువారు మనసొమ్ముల నపహరించిన దొంగలను పట్టడానికి ప్రబల ప్రయత్నాలు చేస్తున్నారట. ఈ మధ్య కలకత్తాలో మొత్తం పది పన్నెండు గొప్పచోరీ లొకవారంలో జరిగాయిట.

మాధ : (ఆలోచించకుండా) అవును నేనూ విన్నాను.

సుద : కారులో మా యింటికి వెడదాము రండి. సత్యవతమ్మ మిమ్మల్ని చూడకపోతే ఏమీ తోచడం లేదంటూంది.

మాధ : (తనలో) తెలిసింది. ఇంటికి తీసుకొనివెళ్ళి ఖూనీ చేద్దామని కాబోలు, అలా చేస్తేనేగాని పీడ వదలదనుకున్నారు కాబోలు. ఈ విషయం ఇందిరకు కూడా తెలుసునా!

సుద : లేవండి మరి వంట్లో స్థిమిత పడేదాకా మాయింట్లోనే వుండవచ్చును.

మాధ : (వణకుతున్న కంఠంతో) నా కిప్పుడంతగా సుస్తీ యేమీ లేదులెండి.

సుద : అయితే సాయంత్రం ఓసారి వస్తారుకదూ. కారు పంపుతాను.

మాధ : (అప్రయత్నంగా) అలాగే.

సుద : మరి శలవు——వెళ్ళివస్తా.

అని సుదర్శనుడు కారెక్కి వెళ్ళిపోయాడు.

సుదర్శనరావు వెళ్ళిపోగానే, మాధవరావుకు నెత్తిమీదనుంచి యేదో బ్రహ్మాండమయిన బరువు దించినట్లయింది. హృదయభారం తగ్గింది. కాని సాయంకాలం వాళ్ళ యింటికి వెళ్ళకుండా తప్పించుకోవాలి, వెళితే తప్పకుండా తన కషాయం వచ్చితీరుతుందని అతను భయపడ్డాడు. సాయంకాలం సరిగాకారు వచ్చేటప్పటికి, తలుపుతాళంవేసి, ఏపార్కులోకో వెళ్ళిపోవడానికి నిశ్చయించాడు. కాని యెన్నాళ్ళని యీ విధంగా తప్పించుకొని తిరగడమా అని ఆలోచన. పోనీ తాను క్షమింపుమని సుదర్శనరావును వేడుకొందామా అని ఒకసారి ఆలోచించాడు. కాని అదిఅంత వివేకమయిన పనిలా కనుపించ లేదతనికి.

క్రమంగా సాయంకాల మయింది. ఇక తనను తీసుకొని వెళ్ళడానికి కారు వస్తుందేమోనని, త్వర త్వరగా డ్రెస్ వేసుకొని,

ట్రాంమీద పార్కుకు వెళ్ళిపోయాడు మాధవరావు. సరిగాఅయిదు గంటలకుకారు వచ్చి మాధవరావు బసవద్ద ఆగినమాట నిజమే. డ్రయివరు దిగి చూసేటప్పటికి గదితలుపు తాళంవేసివుంది. అతను తిరుగ కారును నడిపించుకొనిపోయి, సుదర్శనరావుగారు యింటి దగ్గర లేకపోవడంవల్ల సత్యవతమ్మను పిలిచి "అమ్మా మాధవ రావుగారు యింటిదగ్గరలేరు. తలుపు తాళంవేసివుంది" అని చెప్పి వెళ్ళిపోయాడు. తల్లిదగ్గరనే నిలుచునివున్న ఇందిరకూడా డ్రైవరు చెప్పిన మాటను విని, ఒక్క నిట్టూర్పును విడచి లోపలకు వెళ్ళిపోయింది.

ఆ మరునాటి మధ్యాహ్నందాకా మాధవరావు యిల్లు చేరు కోనేలేదు. ఒంటిగంట కల్లా మెల్లగా దొంగలాగున తలుపు తాళం తీసి, మళ్ళీ లోపల గడియ బిగించుకొంటూ వుంటె అతని కాలికో కవరువుత్తరం తగిలింది. "ఇదెక్కడినుంచిరా అబ్బా! నేను గదిలో లేకబోవడం వల్ల జవానువచ్చి దీన్ని తలుపు సందుల్లో నుంచి పారవేసి వుంటాడు" అనుకొని ఆదుర్దాగా,నేలమీది కవరును దీసి, పైవిలాసం చూసాడు. తన పేరనేవుంది. కాని ఆ వ్రాత మగవాళ్ళెవరూ వ్రాసినట్లు లేదు. తొందరగా కవరును చించి చదవడం మొదలుపెట్టగా అందులో యిలాగున వ్రాసివుంది—

"ప్రియమైన మాధవరావుగారికి—

పరిచితురాలు ఇందిర నమస్కారములు.

ఇంతవరకూ మన మిద్దరముకూడా చాలా అదృష్టవంతు లము. ఆనాటి మన ప్రణయచేష్టలు—మాఅమ్మ చూసిన మాట నిజమే. కాని ఆమె హృదయము దయాసముద్రము కావడంవల్ల నన్నుగాని, మిమ్మల్నిగాని పల్లెత్తుమాట జారవిడవలేదు. పైగా—

భయంవల్లనూ, మన ప్రేమవృక్షం, తొలిపూతలోనే మోడయి పోయిందన్న విచారంచేతను, నేను దుఃఖిస్తుంటే మా అమ్మనన్ను వెయ్యివిధాల ఓదార్చి. అప్పటినుంచే ఈ మన రహస్యాన్ని తన గంభీరమయిన హృదయంలోనే దాచింది. మామయ్యకు ఈ విషయం తెలుస్తే ఎటువంటి ప్రమాద పరిస్థితులు ఏర్పడతాయో అని నేను మహా భీతిల్లాను. నాకొరకు నేనంతగా దుఃఖించలేదు. నా బ్రతుకు కెప్పుడూ దుఃఖభాజనమే. మీకు ఎటువంటి అప్రతిష్ట వచ్చిపడుతుందో అనిమాత్రం మహా ఖేదపడ్డాను. దైవానుగ్రహం వల్ల మా మామయ్యకు ఈ మన ప్రేమవిషయం చీమంతయినా తెలియకుండా, కాపాడింది మా అమ్మ. అదీ కాకుండా ఈ రెండు మూడు రోజులనుంచీ మీరు కనపడక పోవడంవల్ల అమ్మా మామయ్యా కూడా మీకోసం పలవరించి పోతున్నారు. ఇక నా విషయం నేను చెప్పుకుంటే ఆత్మస్తుతి అవుతుంది. నా దీనావస్థ ఎలాగున వుంటుందో మీరే గ్రహించగల రనుకుంటా.

మన తొలిప్రయాణము, కడప్రయాణము కూడా అదే కాబోలు. భగవంతుడు ఏమి చెయ్యదలచుకొన్నాడో ఎవ్వరు చెప్ప గలరు? ఈ మన ప్రేమకు భగ్నమయినందుకు మీరెంతగా దుఃఖి స్తారో నే నెరుగుదును. కాని ఏమిచెయ్యగలను—చెప్పండి? మీ కర స్పర్శ తగలగానే శరీరం కంపించి, ప్రేమకైపుచేత మత్తెక్కి- పోయింది. నన్ను కౌగలింపబోయే, మిమ్మల్ని ఆటంక పరచ డానికి నాకు నోరురాలేదు. అలాగున ఆటంకపరచివుంటె, అమ్మ చూడకనేపోను— ఇంకా కొన్నాళ్ల జీవితంలో ఆనందరేఖలు కనుపించేవి.

మొన్న మామయ్య మీయింటికి వచ్చినప్పుడు వంట్లో సుస్తీగా వుందని చెప్పారుట మీరు. ఆమాట నిజమేనా ? నిన్న డ్రయివరు మీకోసం కారుతెచ్చి—మీ తలుపులు తాళంవేసి వున్నాయని తిరిగి వచ్చేసాడు. మీ రలాగున ఎందుకు తప్పించుకొని తిరుగుతున్నారో నేనెరుగుదును. కాని అంతగా భయపడి, నాకు మీదర్శన భాగ్యమయినా లేకుండా చెయ్యడానికి తగినంత పరిస్థితి యేమి యేర్పడలేదు. ఆనాడు మొదలుకొని ఈనాటి వరకూ నాకు నిద్రాహారాలు రెండూదూరమయినాయంటే నమ్మండి. అక్కడకూ మా అమ్మ నన్ను అనేక విధాల ఓదారుస్తూంది. మీ పునర్దర్శన భాగ్యం కలిగేవరకూ నా కూరట కలగడం కల్ల.

అందుచేత యిప్పుడయిన మనస్సులోవున్న సంకోచములను, భయమును దూరంగా పారదోలి యెప్పటిలాగునే అనుదినం మీ సుందరరూపా స్వాదానాన్ని లభింప జేస్తుంటారని నమ్ముతాను.

ఇట్లు,
మీ....ఇందిర.

ఉత్తరమును కడవరకు జదివిన మాధవరావు రెండు కళ్ళు ఆనందాశ్రువులతో నిండిపోయాయి—పోయిన ప్రాణాలు మళ్ళీ వచ్చిన ట్లయింది. "సత్యవతమ్మ ఇంతటి ఉదారహృదయము కలదా" అని అతను పలుమారు లనుకొన్నాడు. ఇంతవరకూ తాను వాళ్ళమీద లేనిపోని అపోహలుపడి భయపడినందుకు తనలో తానే నవ్వుకొన్నాడు. ఈ వుత్తరం వ్రాసిన ఇందిర తనకు మహోపకారం చేసిందనుకొని, ఆ వుత్తరాన్ని కళ్ళ కద్దుకొన్నాడు. వెంటనే దాన్ని మడిచి, కవరులో పెట్టి, సూటుకేసులో ఉంచాడు. అంతక్రితం మూడురోజులనుంచీ తిండిలేదు—స్నానంలేదు—

తలయినా దువ్వుకోలేదు. బట్టలు విడవడంలేదు. అప్పుడు తేలి కయిన హృదయంతో లేచి క్రొత్త "బ్లేడు"తో క్షవరం చేసుకొని— స్నానంచేసి, తెల్లటి చలువబట్టలుధరించి, అప్పటికి భోజనంవేళ దాటిపోవడంచేత, హోటలుకుపోయి మస్తుగా టిఫెన్ తీసికొని, మళ్ళీ బస చేరుకొనేటప్పటికి కారు నిలబడివుంది. మాధవరావును జూడగానే డ్రయివరు కారులోనుంచి దిగి "సత్యవతమ్మగారు మిమ్మల్ని తీసుకొని రమ్మన్నారు" అన్నాడు. ఆమాటలు వినగానే మాధవరావుకు ప్రాణం లేచివచ్చి నట్లయింది. మారు మాటాడ కుండా కారులో యెక్కి గూర్చున్నాడు. కారు నడుస్తూంది—

"సత్యవతమ్మకు నామీద యింతదయ వుంటుందనుకో లేదు. ఇప్పుడామె పలకరిస్తె ఏమని సమాధానం చెప్పడం? దయి ర్యంతో ఆమెముఖం చూడగలనా? ఇందిరకనుపిస్తుందేమో ఆమె నెలాగున పరామర్శించాలి? సరే, సుదర్శన రావుగారికి నాగుట్లు యేమీ తెలియదుకనక ఆయనతో మామూలుగానె మాట్లాడవచ్చు. ఇంతకూ నాలోప మేముంది సర్వమూ కాలమే నిర్ణయించగలదు" అని మాధవరావు తలపోసేటప్పటికి కారు సుదర్శనరావుగారి యింటిముందు ఆగింది. వెంటనే దిగడానికి మనస్కరించక, ఆత నింకా కారులో అలాగునే గూర్చుంటె డ్రైవరుజూసి, తలుపు విగిసి వుందనుకొని, తానుదిగి, కారుతలుపును నొక్కి తెరిచాడు. ఇంక ఆలస్యం చెయ్యకుండా మాధవరావు మెల్లగా మెట్లనెక్కి లోపల ప్రవేశించాడు. ముందుగా సత్యవతమ్మ అతనికెదురై చిరు నవ్వు మొగంతో "ఏం నాయనా మామీద యిలా దయ తప్పిందేం? వంట్లో సుస్తీగా వుందన్నారు. ఎలావుందీ" అన్నది. ఆమె పవిత్రమయిన ఆదరణ వచనాలను వినగానె, మాధవరావుకు

ఆమెయందో విధమయిన పూజ్యభావం ఉదయించింది. మూడు రోజులక్రితం తాను ఇందిరను కౌగలించుకొని ముద్దుపెట్టుకొన్న దృశ్యం అతని కప్పుడు కన్నులకు గట్టి నట్లవుపించింది. అందు చేత అతనామెకు వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు.

" అలా కూర్చో! ఇప్పుడు బాగా కులాసాగా వుందా " అని సత్యవతమ్మ మళ్ళీ అడిగింది. ఇంకా మాట్లాడకుండా వుంటె మరీ మొండితనంగా వుంటుందని " ఆ కులాసాగానే వుందండి " అని అన్నాడు అతను. అతను సిగ్గుచేత మాటలాడ లేకుండా వున్నాడని సత్యవతమ్మ ఏవేవోప్రశ్నలడిగి, అతనికి ప్రశాంతత చేకూర్చింది. ఇంతలో సుదర్శనరావు గూడవచ్చి మాధవునిజూసి " కులాసాగా వుందా " అన్నాడు. మాధవరావు " ఊఁ " అని క్లుప్తంగా సమాధానం చెబుతుంటే అక్కడున్న కిటికీలోనుంచి, ఇందిర మాధవ రావునకు కనుపించింది, ఆమె తనకళ్ళతోనే అతన్ని ఎన్నెన్నో కుశలప్రశ్నల నడిగింది— అతనూ తన కళ్ళతోనే ఆమెకు కృతజ్ఞతను తెలిపాడు. వీళ్ళు పరస్పరావలోకనం చేసుకొంటూ వున్నప్పుడు సుదర్శనం స్పష్టంగా జూసాడు. కాని ఈ సంగతిని ఇందిరా మాధవులు కనిపెట్టలేదు. సుదర్శనుడు తనలో యేమనుకొన్నాడో, అప్పటికి చాలా ప్రొద్దుపోయ్యేవరకు సుదర్శనరావు—మాధవరావు, ఏమేమో మాట్లాడుకొన్నారు. ఆ రాత్రికి అక్కడే వుండిపోవలసిన దని, సత్యవతమ్మ, సుదర్శనుడు మాధవరావును బలవంతపెట్టారు. వాళ్ళమాటకు అతను కాదనలేకపోయాడు.

ఆ రాత్రి మాధవరావుకు విందు—భోజనాలయాయి. ఆ క్రొత్తయింట్లో చెయ్యి ఎక్కడ కడుకోక్కవాలో మాధవరావుకు [illegible] చెయ్యికడుక్కొని లోపలకు వస్తుంటె

తమలపాకులపళ్ళెం ఆఫీసుగదిలోకి తెస్తున్న ఇందిర అక్షనికి మధ్యగుమ్మంలో తారసపడ్డది. "ఉత్తరం అందిందా" అని ఆమె అమృత మొలికేటట్టు అడిగితే "ఊఁ" అని మాధవరావామె బుగ్గలమీద నీటిబిందువులను చిలికి—దొడ్లోవున్న సుదర్శనరావును కలుసుకొని కాళ్ళు కడుక్కొన్నాడు.

"చేతులు వీధిలోను—కాళ్ళు దొడ్లోనూ బాగుంది" అని సుదర్శనం నవ్వుతూఅంటె దానికి సత్యవతమ్మ సర్దిచెప్పేసింది.

ఆ మాటకు సుదర్శనుడు. మాధవుడు నవ్వుకొని కచేరి సావడిలోకి వెళ్ళిపోయారు చేతులు తుడుచుకొంటూను.

# 10

"అది ప్రపంచమంతటా చెలరేగిన బ్రహ్మాండమయిన తుఫాను" అని అన్ని పత్రికల్లోను ప్రచురింప బడుతున్నది. మూడురోజుల నుంచి, ఎడతెరపి లేకుండా, హోరుగాలి, దట్టమైన కారుమేఘాలు ఆకసమునంతనూ ఆవరించి సూర్యదర్శనం లేకుండా చేస్తున్నది. ప్రొద్దుచూస్తేనేగాని భుజింపని నిష్టపరులకా మూడురోజులు వస్తె. మధ్యమధ్య వర్షం కురుస్తుండడం, దానితో ప్రళయకాల ఝుంఝూ మారుతం వీచి, ఎన్నో తరాలనుంచీ, పెద్దపెద్ద గాలివానలకు సహితం సమాధానం చెప్పిన మహావృక్షాలను నేలగూల్చి. పెద్ద పెద్ద మేడలను—గోపురాలను అల్లల్లాడించడం జరుగుతున్నది. పెద్దపెద్ద తరుశాఖలుపడి టెలిగ్రాపుతీగలు—ఎల్కట్రిక్ తీగలు తెగిపోతున్నాయి. అందుచేత తంతివార్తలు సరిగా నడవడంలేదు. శాస్త్రకారులు-పరిశోధకులు ఈ తుఫాను యింకా రెండుమూడు రోజులుంటుందని చెబుతుండడంవల్ల సర్వప్రాణులూ హడలెత్తి

పోతున్నాయి. ప్రళయం అంటే అదే ననుకుంటున్నారు. మేడలలో హంసతూలికా తల్పాలమీద పరుండే శ్రీమంతులు పాన్పులు దిగకుండా, ఎలాగో కాలక్షేపం చెయ్యగలుగు తున్నారు. కాని కూలి నాలి చేసుకొని పొట్టపోషించుకొనే పాటకపు జనులు బిచ్చమెత్తుకొని బ్రతికే కుంటిగ్రుడ్డిలు పడే బాధలు చెప్పడానికి తరం కాకుండా వున్నాయి. తలదాచుకోడానికి పంచలులేవు కడుపాకలి చల్లార్చుకోడానికి దోసెడు గంజిఅయినా లేదు. మృగపక్ష్యాదుల సంగతి చెప్పనే అక్కరలేదు.

అది తుఫానుయొక్క మూడవనాటి రాత్రి—పదకొండు గంటలకు పైగా దాటివుంటుంది. హోరుగాలి—పిడుగులు పడడం యెథాప్రకారంగానే వున్నాయి. ఎటుచూచినా కన్నుపొడుచుకొన్నా కనుపించని కారుచీకటి ఏరోడ్డుమీద జూచినా జనసంచారమన్న మాటలేదు. చెట్లువిరిగిన చప్పుడులు-ఇండ్లుకూలిన ధ్వనులు—స్థంభాలుపడిన గల్లంతులుతప్ప మరేమీలేదు. చచ్చిపోతున్న మృగపక్ష్యాదులతోను ప్రకృతిఅంతా మహాభీభత్సంగావుంది. ప్రళయకాలమైనా అంతటి ఆర్భాటంతో చెలరేగుతుందని ఎవరూవూహించుకోలేరు. మిలమిల మెరసే మెఱుపులమధ్య పెళపెళార్భాటులు చెలరేగి, లోకాన్నంతటను చీకాకుపరచి, బ్రహ్మాండమంతా బ్రద్దలగుతున్నట్లు—ఆకాశం విరిగిపోయి భూమిపై పడిపోతున్నట్లు మహాధారుణము భయంగా వుంది—ఎటుజూసినా....

అటువంటి ప్రళయకాల సమయంలో సుదర్శనరావుగారి మేడముందు ఒకకారు నిలబడివుంది. ఒకవ్యక్తి ఆపాదమస్తకము నల్లటి బురకాతొడిగి, చెట్లకొమ్మలను—ఎలక్ట్రిక్ స్థంభాలను ఆధారం చేసికొని మెల్లగా సుదర్శనరావుగారి మేడపైకెప్రాకి

పోతున్నాడు. అత డతిప్రయాసమీద మేడనెక్కి ఊపిరైనా విడవ కుండా ఆవ్యక్తి దేనికొరకో అన్నిగదులూ చప్పుడు కాకుండా వెదుకుతున్నాడు. ఒకగదిలో సుదర్శనుడు శాలువ కప్పుకొని గాఢంగా నిద్రబోతున్నాడు. రెండవగదిలో ఎవరో కొంద రాడంగులు—పిల్లలు పడుకొని నిద్రబోతున్నారు. మూడవగదిలో ఒక మంచంమీద సత్యవతమ్మ నిద్రిస్తున్నది. ఆమెప్రక్కనే మరో మంచంమీద ఇందిర పోతబోసిన బంగారు బొమ్మలాగున ఒంటి మీద స్పృహలేకుండా, గాఢనిద్రావస్థలో నున్నది. ఆగదిలో ప్రవేశించిన భయంకర వ్యక్తి సత్యవతమ్మ ముక్కుముందు ఒక గుడ్డను పెట్టి వాసనచూపించి, దానినే తరువాత ఇందిర ముక్కు దగ్గర పెట్టి పీల్పించాడు. తరువాత అతను ఇందిరను మెల్లగా సందిట యిరికించుకొని, రెండవ అంతస్తుమీదినుంచి, మొదటి అంతస్తుమీదికి దిగి, ఇందిర నక్కడదింపి, అక్కడనుంచి సరిగా కారులో పడేలాగున, ఆమెను జారవిడచి వెంటనే తానుగూడ కారులో గాకుండా క్రింది కురికాడు. అతను క్రింది కురకడంవల్ల పెద్దచప్పుడయింది. ఆ చప్పుడును వినగానే అక్కడే పీధిగదిలో పడుకొన్న సుదర్శనరావుగారి కారుడ్రైవరులేచి, చప్పుడైన వైపు జూసాడు. అతనికా కారుయొక్క ఎర్రదీపం—ఎవరో ఆ కారులో తొందరగా ఎక్కడం మాత్రం లీలగా కనుపించింది. వెంటనే అతను తనకు దగ్గరగానేవున్న "ఎలక్ట్రిక్ బెల్" స్విచ్చి నొక్కాడు. అక్షణంలోనె సుదర్శనరావు పడకగదిలో పెద్దఅలారం మ్రోగింది. అతను వెంటనే ఉలికిపడిలేచి, ఒక్కపరుగులో మేడ ముందుకు వచ్చి క్రిందికి జూసాడు. అప్పుడే కారు ఇరవైగజాల దూరంలో పరుగెత్తుతూంది. దాని వెనుకనున్న ఎర్రలైటు, కారు

నెంబరు మాత్రం అతనికి కనపడింది. వెంటనే ఫోను టేబిలు దగ్గరకు వెళ్ళి;

"నెంబరు 234 కారు—దొంగలు—హీరా స్టేషను—పట్టుకోవాలి—ప్రమాదం" అని పోలీసుస్టేషనుకు చెప్పి, సత్యవతమ్మ పడుకొన్న గదిమీదుగా క్రిందికి పోతూ, ఇందిర పక్కమీద లేకుండడం జూసి, క్షణంలో సర్వం అవగాహన జేసికొన్నాడు. వెంటనే లాల్చీతొడుక్కొని, కొంత పైకం జేబులో వేసుకొని, క్రిందికి దిగేటప్పటికే డ్రయివరు కారు సిద్ధంజేసివుంచి "ఆలస్యం చెయ్యకండి" అని సుదర్శనరావును హెచ్చరించాడు. సుదర్శను డక్కడ పడుకొన్న నౌఖరును లేపి, తలుపులు జాగ్రత్తగా వేసుకొని మేలుకొనివుండు. ఇందిరను దొంగలపహరించారు. మనవాళ్ళతో ఇంగారు పడవద్దని చెప్పు" అని మాత్రం చెప్పి, కారులో గూర్చున్నాడు. వెంటనే డ్రయివరు కారు స్టార్టుజేసి మేఘాలమీద పోలీసు స్టేషనువైపు నడిపాడు.

స్టేషనుకు సుదర్శనుడి ఫోనువార్త జేరేటప్పటికి సర్కిలు ఇనస్పెక్టరే దాన్ని అందుకొని, నలుగురు పోలీసుల్ని లేపి, కారు రెడీ చెయ్యమని చెబుతుండగానే, స్టేషను ముందునుంచి ఓకారు రివ్వుమంది. ఒక్కపరుగున పోయిచూచేటప్పటికి అదే 234 నెం. కారని అతను గ్రహించాడు. వెంటనే నలుగుర పోలీసులతో తన కారుమీద ముందుకారును వెంటాడించాడు. ఇది జరిగిన అయిదు నిమిషాలకు సుదర్శనుడు తనకారుతో పోలీసుస్టేషనుకు చేరుకొని, వాకబు చెయ్యగా అప్పుడే సర్కిలు ఇనస్పెక్టరుగారు నలుగుర పోలీసులతో 234 నెం. కారును వెంటాడిస్తూ వెళ్ళారని తెలిసింది. అప్పుడు సుదర్శనుడు స్టేషనులోవున్న ఫోను టేబిలు దగ్గరకువెళ్ళి-

"దొంగలు—ఇ-దిక-హౌరాస్టేషనుకు రండి-జరుగుకు"

అని రమేశచంద్రునాడికి చెప్పి మళ్ళీతాను కారులో కూర్చున్నాడు. అది శరవేగాన్ని మించి నడుస్తున్నది.

రైలు కదలడానికి గంట కొట్టబడింది. ఇంతలో పోలీసుల కారు—సుదర్శనుడి కారు—రమేశచంద్ర మాధవరావుల కారు, ఒకటి తరువాత ఒకటి స్టేషను చేరేటప్పటికి రైలు ప్లాటుఫారం విడిచింది. అందరూ ఒకరి ముఖాలకేసి ఒకరు శూన్యదృష్టులతో తిలకించుకొన్నారు. హోరుగాలి చెంపలు బ్రద్దలుకొడుతూంది. పోలీసు ఇన్స్పెక్టరు మిగతావాళ్ళను జూసి, "త్వరపడండి—ముందు స్టేషనులో పట్టుకొందాము" అంటూనే కారులో కూర్చున్నాడు. మిగిలినవాళ్ళు కూడా మారు పలకకుండా కార్లలోకిగెంతి గూర్చున్నారు. డ్రయివర్లు కార్లుస్టార్టుచేసారు, అవిఅంతకు ముందుకంటె కూడా వేగంగా పరుగెత్తాయి. కాని—ఆ ముందుస్టేషనులోగూడా అవి మెయిలును కలుసుకోలేక పోయినాయి ఈ ప్రకారంగా మెయిలు ముందు—తరువాత మోటార్లు పరుగెత్తుతున్నాయి.

ఖురధారోడ్డు దగ్గరనే పూరీజంక్షనువుంది. కలకత్తా నుంచి కాని, మదరాసు నుంచి కాని పూరీ వెళ్ళదలచుకొన్న వారాఖురధా జంక్షను దగ్గర దిగి మరోబండి నెక్కుతారు. మెయిలు ఆ జంక్షనుకు ఇంక రెండుమైళ్ళ దూరంలోవుంది. విధివశాన్ని ఎవరు తప్పించగలరు? అక్కడకు బండి వచ్చేటప్పటికి ఆ ఖురధారోడ్డు, అంతకుముందు కురిసిన పెద్ద వానవల్ల, నీరు రైలుపట్టాలను ముంచేసి, గట్టును తెగ్గొట్టేసింది. ఈప్రమాదము నెరుగని రైలు బండి అక్కడదాకావచ్చి, పెళపెళార్భటులతో విరిగిపడిపోయింది, వెనకాల ప్రక్కరోడ్డు ననుసరించి పరుగెత్తుతున్న కార్లలోనివారా

చప్పుడును విని మొదట ఉరుములని భ్రమపడ్డారు. కాని, ఆ చప్పుడుతో హా హా, కారాలు చెలరేగడం వల్లను కారులు ఇంకా ముందుకు పోవడంవల్లను, రైలుబండే బోల్తాపడిందని గ్రహించారు. త్వరగా నడపవలసిందని డ్రయివర్లను ప్రోత్సహించారు. అచిరకాలంలోనే కార్లు మూడూ ఆ తెగిన గట్టుకు నలభయిగజాల దూరంలో ఆగాయి. అందరు కార్లుదిగి, కాలినడకనే రైలు విరిగి పడిన చోటుకు వెళ్ళిచూసారు. ఏముంది, తల్లులను బాసిన పిల్లలు–భర్తలను బాసిన భార్యలు—పెద్ద గోలపెట్టి యేడుస్తున్నారు. శిరములను వీడిన మొండెములు—తెగిన కాలుచేతులు నాలుగు వైపులా చెదరి వున్నాయి. రైలు బండి సగానికిపైగా స్వరూపమయినా లేకుండా ముక్కముక్కలై పోయింది. రైలులోని సామానులు విరజిమ్మబడి వున్నాయి. అప్పటికప్పుడే ఖుర్ధాస్టేషను నుంచి కొందరు దొరలు ట్రాలీలమీద లాంతర్లు వేసికొనివచ్చారు. "ఖురధారోడ్డు తెగిపోవడంవల్ల మెయిలు తిరగబడింది" అన్న సమాచారం అన్ని స్టేషనులకు తెలుపబడింది. దీపాలను వెలిగించి, పోయిన ప్రాణాలను వున్న ప్రాణాలను వెదుకుతున్నారు, ఎంతకు అంతు దొరకడంలేదు. ప్రాణాలతో నున్నవాళ్ళను ట్రాలీలమీద ఖురధా హాస్పటలుకు పంపుతున్నారు. చచ్చిన శవాలను లాగి వేరుగా పారేస్తున్నారు.

ఈలోపుగా తెల్లవారింది. ఇంకా సూర్యోదయం మాత్రం గాలేదు. నాల్గుస్టేషన్లనుంచీ, కొత్త యింజనులు—మనుష్యులు—ఆహార పదార్థాలు అన్నీ వచ్చిపడ్డవి. ఇంకా అక్కడక్కడ కొన్ని చచ్చిన కళేబరాలు—చావబోయే శరీరాలు పడివున్నాయి. పోలీసు సర్కిలు—మాధవరావు—సుదర్శనరావు, అక్కడ పడివున్న వ్యక్తి ముఖంకేసి మహా ఆవేదనతో పరకాయించి జూస్తున్నారు.

ఒక దట్టముగా పెరిగివున్న గడ్డిదుబ్బులో పదహారేళ్ళ బాలికయగు ఇందిర చేష్టలుదక్కి పడివుండడం వారు జూసి, ఆమెకింకా వూపిరి ఆడుతూనే వున్నందున సుదర్శన మాధవులు సంతసించి, ఆమెను కారుమీద ఆసుపత్రికి పంపించి, తాము మళ్ళీ అక్కడ పడివున్నవాళ్ళను వెదుకుచుండిరి.

ఒక బ్రిహ్మజెముడు డొంకలో ఎవరో ఒకవ్యక్తి ఇరుక్కొనివున్నాడు. కాళ్ళుమాత్రిం బయటకు వ్రేలాడుతున్నాయి అప్పుడు వారువెంటనే వారాడొంకను మెల్లగా తప్పించి, ఆవ్యక్తిని బయటకులాగి, గడ్డిమీద పడుకో బెట్టారు. రమేశచందు ఆ వ్యక్తి ముఖాన్ని పరీక్షించి "అయ్యో! గోపీచందు—ఇతనిక్కడి కెలాగు వచ్చాడు" అని అరచాడు. అప్పుడు మాధవరావు, ఇనిస్పెక్టరునూ ఆ వ్యక్తి గోపీచందు అని తెలిసికొన్నప్పుడు ఆశ్చర్య నిమగ్నులైనారు. అతడప్పుడు ప్రాణాలనువిడచే పరిస్థితిలోవుండి 'దాహం' అని సౌంజ్ఞచేసాడు మాధవరావు కొన్నినీళ్ళుతెచ్చి, అతని గొంతుకలో బోసాడు. వాటిని త్రాగి,

".....నేను సేవించే ప్రభువులకు—మిత్రులకు మహా ద్రోహాన్ని తలపెట్టిన నాకీ ప్రాయచిత్తం గావలసిందే. నేనింక ఎల్లాగా బ్రతకను, నాయీ అంత్యదశలో నా ఘోరకృత్యాలను దాచడాని కిష్టంలేక చెప్పేస్తాను ఆనాడు టీ తోటవగ్గర సత్యవతమ్మను దోచుకొన్నది మొదలు ఈనాటివరకు చేసిన ఘోర కృత్యాలన్నీ నావే. మీరు నన్నింకేమి చెయ్యలేరు. అన్నీ భగవంతుడే చేశాడు. ఇందిరకు ఏవుపద్రవం రాకుండునుగాక! నేను ప్రాణాలు విడవగానే మాత్రం యింత బూడిద చెయ్యండి. ఇదే నా అంత్యప్రార్ధన.........." అని గోపీచందు కళ్ళుమూసాడు.

ఒక నెల గడచేటప్పటికి ఇందిర మామూలు మనిషి అయింది. చచ్చినదనుకొన్న తన ముద్దుబిడ్డ మళ్ళీ బ్రతికివచ్చి నందుకు సత్యవతమ్మ ఆనంద పరవశురాలైంది. ఇందిర మాధవుల పవిత్ర ప్రేమ వ్యవహారాల నన్నిటినీ సుదర్శనరావుకు జెప్పి, వాళ్ళిద్దరకు పెళ్ళిచెయ్యక తప్పదని పట్టుబట్టి ఒక శుభ ముహూర్తమున ఇందిరా మాధవులకు దేవేంద్రవైభవంతో వివాహంచేసేరు. స్త్రీ పునర్వివాహాలను ప్రోత్సహించే సంస్కర్త లనేకులువచ్చి ఆ నూతన దంపతుల నాశీర్వదించి వెళ్ళారు. రమేశచందు మొదలయిన పెద్దలు యోగ్యుడయిన మాధవరావునకు ఇందిర తగిన యిల్లాలన్నారు.

నాటినుంచీ ఇందిరామాధవులు చిలుకా గోరింకలకు సిగ్గు వచ్చేటట్లు అనురాగ దంపతులై అత్యధికానందముతో నుండిరి.

సమాప్తము.



శ్రీ రాజేశ్వరి ప్రెస్, రాజమహేంద్రవరము.

Rajeswari Press, Rajahmundry.